# ప్రథమ భారతీయ నౌకా నిర్మాణ పరిశ్రమ

## విశాఖపట్నములో శంకుస్థాపన రాజేంద్రప్రసాదుగారి ఉపన్యాసము

ప్రభుత్వమువారి ప్రాతికూల్యమును వాల్చంద్ హీరాచందుగారు ఖండించుట

విశాఖపట్నం జూను ౨౧

అత్యంత ఉత్సాహకరమగు పరిస్థితులలో ప్రకృతిశోభాయమానమగు క్షేత్రమందు ఏర్పరుపబడ్డ వెనుకకొండలమధ్య, చక్కగ అలంకరింపబడిన పందిరియందు సుమారు ౩౦౦౦మంది సమక్షమున సింధియాస్టీము నావిగేషనుకంపెనీవారి నౌకా నిర్మాణశాల శంకుస్థాపనోత్సవమును బాబురాజేంద్రప్రసాదుగారు నేడుజరిపిరి.

కార్యవిజయముకోరుచు అనేక సందేశములు వచ్చినవి మహాత్మాగాంధి, సర్ పి.సి.రాయి కవి ఠాగూరు. పండితనెహ్రూ. సర్ మీర్జాఇస్మేలు, డా. అరండేలు. సర్ మహమ్మదుయాకూబు మున్నగువారు సందేశాలంపిరి.

ఈదు శంకుస్థాపనోత్సవము శాస్త్రయుక్తంగా మంత్రాలతో జరిగెను. వందలకొలది బ్రాహ్మణులువచ్చిపాల్గొనిరి- సింధియాకంపెనీ డైరక్టరు అందరువచ్చిరి. ౬౦౦౦ నుండి ౧౫౦౦౦టన్నుల స్టీమరులుకట్టుటకు అవకాశముండును- ప్రాజక్టంతా ఒకకోటియగును- ౬౦౦౦ కూలీలు అప్పుడే పనిచేయుచున్నారు- మహాత్మగాంధిగారు యీ దిగువరీతి వ్రాసిరి.

"మీఆహ్వానంఅందింది. రాజేంద్రబాబు విశాఖపట్నం పోవుచున్నందున, నాఃద్దనుండి వేరే సందేశంఅవసరముండదు- అయినా కీ॥శే॥ సాతుపరోత్తంగారికి నాకుగల స్నేహము ననుసరించి, మీరు నాఆశీర్వాదమునుకోరుచుండుట సహజం మీకృషి జయప్రదమగుగాక, దేశమంతకు అది లాభదాయకంగా నుండుగాక"

వాల్చందు హీరాచందుగారు స్వాగతోపన్యాసమునం దిట్లుదెలిపినారు: —

మాకంపెనీవారికూడ నిర్మించదలచిన నౌకానిర్మాణస్థానానికి పునాదిరాయినివేయుటకు మీరుదయతో అంగీకరించినందున మేముమీకుమిక్కిలికృతజ్ఞులముగావున్నాము. ఇండియాలో యిప్పటివరకు ఒక్క నౌకానిర్మాణస్థానమున్నా లేదు- ఇదేమొదటి నౌకానిర్మాణస్థానము.

### జాతీయనాయకుల సహాయము

మాకంపెనీ భారత జాతీయ నౌకాసంఘాలలో ముఖ్యతమమైనది. మ కంపెనీకిదివరకుచాలా చిక్కులుకలిగాయి. ఇప్పుడుకూడా కలుగుతాయనేతోస్తుంది.

### మొదటి భారత ప్రయాణికుల నౌక

౧౯౧౯ ఏప్రిలు ౫వతేదీని భారత నౌకాచరిత్రలో మొదటిసారి విఖ్యాతులైనకొంతమందిభారతపుత్రులతోను పుత్రికలతోను ఒక భారతీయ ప్రయాణికులనౌక బొంబాయినుంచి ఇంగ్లాండుకు బయలుదేరింది.

### భారత జాతీయవార ప్రారంభదినము

ఆతేదీనే దేశమందంతటా జాతీయస్వాతంత్ర్యమునిమిత్తం జాతీయవారంకూడా ప్రారంభించబడెను. ఇదిమిక్కిలి అపూర్వమైనఅద్భుతసన్నివేశము. భారతమాత జీవాత్మకు సాక్షాత్మూర్తియనదగిన గాంధిమహాత్ముడానాడు సింధియాకంపెనీ స్థాపకుడైన సేటు నరోత్తమమురార్జీగారివద్దకు వెళ్ళి మాకంపెనీవారిప్రయత్నము సఫలమయి మొదటినౌక అనాడేబయలుదేరినందుకు మాకంపెనీని సేటుజీని మనఃపూర్వకంగా ఆశీర్వదించినాడు. మాకంపెనీ ఏర్పడినప్పటినుంచిన్నీ భారతజాతీయ ప్రధాననాయకుడైన గాంధిమహాత్ముడు మాకధికమైనప్రోత్సాహము నిస్తూనేవున్నాడు. మహాత్ముని ఆశీర్వాదమహిమవల్ల మాకంపెనీకి దినదినాభివృద్ధికలుగుతూవుంది

మాకంపెనీవారు గ్లాస్గోలోకట్టించిన రెండు స్టీమరులలోను మొదటి స్టీమరును ౧౯౨౭ లో స్వర్గీయ వి. జె. (విఠలభాయి) పటేలుగారు సముద్రంలో వదిలారు. రెండవ స్టీమరును ౧౯౨౯లో స్వర్గీయ పండితమోతీలాలుగారు సముద్రంలోవదిలారు-౧౯౩౬లో భూలాభాయి దేశాయిగారు మాకార్యాలయమైన సింధియాహౌసుకు పునాదిరాయినివేశారు. ౧౯౩౭లో భారతకాంగ్రెసు మహాసభాధ్యక్షుడుగావున్న పండితజవహరలాలుగారున్నూ భారతకాంగ్రెసు కార్యసంఘసభ్యులున్నూ మేము ప్రయాణికులరాకపోకలనిమిత్తం ప్రత్యేకంగాకట్టించిన ఎల్మ్రీనాస్టీమరుమీఁకి ౧౯౩౭పవరినెలలోవచ్చి దానిని చూశారు. భారతజాతీయ పతాకంతో భారతనౌకలు సముద్ర మార్గాలగుండా దూరదేశాలకు రాకపోకలను సల్పడం యెప్పుడా? అని నేను చాలా ఆతురతతో వున్నాను అని జవహరలాలుగారు మాకప్పుడొక సందేశమునుకూడా పంపారు- ౧౯౩౭ డిశంబరులో సర్దారు వల్లభాయిపటేలుగారు సింధియాహౌసును తెరిచారు- ఈరీతిగ భారతకాంగ్రెసు ప్రధాననాయకులు మాకంపెనీ యేర్పడినప్పటినుంచిన్నీ మాప్రయత్నాలన్నిటిలోను మనఃపూర్వకంగా పాల్గొంటూ మాకత్యధికమైన ప్రోత్సాహమును ధైర్యమును కలుగజేస్తున్నారు-

### రాజేంద్రప్రసాదుగారికి కృతజ్ఞత

ఈవాళ అనగా ౨౧-౬-౪౧ వతేదీ ఉదయమున భారతకాంగ్రెసు ప్రధాననాయకులలో ఒకరైన డాక్టరు రాజేంద్రప్రసాదుగారు మా నౌకానిర్మాణస్థానానికి పునాదిరాతినివేశారు- ఇది మాకంపెనీకికలిగిన మరొక గొప్పఅదృష్టము-

### భారతప్రాచీన నౌకావ్యాపార నిర్మూలనం

ప్రాచీనకాలంనుంచీ ఇండియాలో నౌకానిర్మాణము హెచ్చుగాజరుగుతూ నేవుండేది- బ్రిటిషువారు ఇండియాలో అడుగుపెట్టటానికి అనేక శతాబ్దాలకుపూర్వమే ఇండియాలో కట్టబడినౌకలు భారతదేశపుసరకులను వాణిజ్యంనిమిత్తము విదేశాలకు తీసుకొనివెళుతూవుండేవి. ఆనౌకలను నిర్మించినవారినైపుణ్యమును అన్నిదేశాలవారున్నుకూడా ప్రశంసించారు- బ్రిటిషువారుతమకు కావలసిన చాలానౌకలను ఇండియాలోనే కట్టించుచున్నారు. ఇండియాలో బ్రిటిషువారి అధికారం స్థిరపడినతరువాత వారికిభారతీయ నౌకల పట్ల యీర్ష్య భావంకలిగింది- ఇండియాదేశపుసరకులతో ఇండియావాణిజ్యనౌక లండనునగరము రేవులలోకి విస్తారంగా వెళ్లుతూవుండడంవల్ల వారికి కన్నెర్రనయి భారతనౌకానిర్మాణవ్యాపారములను నిర్మూలించడానికి వారు దీక్షవూనినారు-

### డాక్టరు టెయిలరుగారి గ్రంథంలోని అంశాలు

౧౯వ శతాబ్దంయొక్క చరిత్రవ్రాసిన విఖ్యాతుడైనడాక్టరు టెయిలర్ ప్రాచీన నవీనభారతము నే పేరుగలగ్రంథమును వ్రాశారు దానిలో భారతనౌకలనుగురించి యీలాగువ్రాశారు.

"ఇండియాలో భారతీయులచేత నిర్మించబడినౌకలు భారతదేశంలోని వస్తువులతో వాణిజ్యవ్యాపారాలనిమిత్తం లండనురేవుకు రాగానే శత్రుదేశంనుంచి యుద్ధనౌకలు ఆకస్మాత్తుగ యుద్ధానికొస్తే యెటువంటిసంక్షోభం కలుగుతుందో ఆటువంటిసంక్షోభం లండనులో సత్తదారులకందరికీకలిగింది. లండనులో నౌకలనునిర్మించేవారు గొప్పఆందోళనమును ప్రారంభించారు భారతనౌకలపోటీవల్ల ఇంగ్లాండులో నౌకానిర్మాణానికి అపాయంవస్తుంది. ఈపనిచేసేవారి కుటుంబాలవారు తిండిలేక మాడిపోతారు-

వీరీలాగు ఆందోళనం చేయ్యడంవల్ల బ్రిటనులో అధికారులు ఇండియాలోకట్టబడిన నౌకలను బ్రిటిషురిజిస్టరులో నమోదు చేయడానికి వీల్లేదన్నారు. భారతనౌకలలో నావుకులను లండనుకుపంపదలచిన వర్తకులను అనేకవిధాల నిరుత్సాహపరిచారు. భారతీయులు నౌకలమీద యిండియానుంచి లండనుకు ప్రయాణంచేయడానికి తగినశరీరదారుఢ్యం వారికిలేదన్నారు.

౧౯౧౪లో యూరపులో మొదటియుద్ధం జరిగినప్పుడు మళ్లీ బ్రిటిషువారు భారత నావికుల శక్తిసామర్థ్యాలను అత్యధికంగా ప్రశంసించారు కష్టాలనుసహించేశక్తి వీరికత్యధికంగాయుందన్నారు. ఈయుద్ధంలోకూడా బ్రిటిషువారు భారత నావికులను అత్యధికంగాసాగుడ తూనేవున్నారు

## ఇదంతా యీస్టుయిండియా కంపెనీ వారి చలవ

౨౬-౧-౧౮౧౪ వ తేదీని ఈస్టుయిండియా కంపెనీ డైరెక్టరుల సంఘంవారు పార్లమెంటు ప్రభువుల సభవారికి వ్రాసిన లేఖలో భారతనావికులను భారతీయుల నౌకావ్యాపారమును పూర్తిగా నిరసిస్తూ వ్రాశారు. ఈరీతిగా భారత ప్రాచీననౌకా వ్యాపారం ఈస్టుఇండియాకంపెనీవారి పుణ్యమా అని అంతరించిపోయింది. ఇప్పుడు మనం మళ్లీ యిండియాలో యీపరిశ్రమను వృద్ధిపొందించవలెను.

## సింధియాకంపెనీవారి ప్రయత్నం

౧౯౧౯లో సింధియాస్టీము నేవిగేషనుకంపెనీ యేర్పడింది. మానౌకలను ఇండియాలోనే కట్టించవలెనని మేమప్పటినుంచీ ప్రయత్నం చేస్తూనే ఉన్నాము. భారతీయులవల్లనే భారతనౌకలు ఇండియాలో నిర్మించబడవలెను. వాటికి భారతీయులే యజమానులుగాను నావికులుగాను ఉండవలెను. ఇండియాలో నౌకలనుకట్టించుటకున్నూ మరామత్తుచేయుటకున్నూ తగినస్థానాలను యేర్పరచడమునుగురించి ఇంగ్లాండులో ప్రవీణులతో ఆలోచించడానికి స్వర్గీయ నేటువరోత్తము మురార్జీగారున్నూ నేనున్నూ ౧౯౧౯లో ఇంగ్లాండు వెళ్ళాము, ఆసంవత్సరాలలో బ్రిటిషుయిండియా స్టీము నేవిగేషనుకంపెనీవారిపోటీ చాలాఅధికమయింది. వ్యాపారం చాలాతగ్గిపోయింది. అందువల్ల మాకంపెనీమూలధనంలో సగంఖర్చయిపోయింది. అందువల్ల ౧౯౩౬వరకు మళ్లీ మేము ప్రయత్నించటానికి వీలులేకపోయింది.

## స్థలంకోసం ప్రయత్నం

స్థలంకోసం మేము బొంబాయిలో ప్రయత్నించాము. అక్కడస్థలందొరకలేదు. ౧౯౩౭లో కలకత్తాలో ప్రయత్నించాము. అప్పుడు సరియైనస్థలంకనబడలేదు. కలకత్తాలో కింగుజార్జి డాకువద్దనా ప్రవీణుడొకస్థలమును ౧౯౩౮లో చూచిఆమోదించాడు, కలకత్తా పోర్టుకమీషనరు ఆస్థలానికి విపరీతమైనఅద్దెనుకోరాడు. ఆరంభంలో సాలుకు ౧౪౦ వేల రూపాయిలు ౩౦ యేళ్ళలో సాలుకు ౩ లక్షల రూపాయలు అతడుకోరాడు. ౧౯౩౯ డిశంబరులో ఇండియా ప్రభుత్వము వాణిజ్యసభ్యునితో కలకత్తాలో దీనినిగురించిమాట్లాడాను. యూరపులోమళ్లీయుద్ధం ప్రారంభమయింది. చాలాస్టీమరులు మునిగిపోతున్నాయి. క్రొత్తస్టీమరులనుకట్టించవలసిన అవసరం అధికమయిందిగాని అధికారులు చురుకుగా పని చెయ్యలేదు. ఆరునెలలు వ్యర్థమైపోయాయి. కలకత్తాస్థలంమీద ఆశవదులుకున్నాం.

## విశాఖపట్నంలో స్థలం

౧౯౪౦ జులైనెలలో నేను సిమ్లావెళ్లి అధికారులతో రాయబారాలను జరిపాను అందువల్ల యీస్థలందొరికింది. విశాఖపట్టణంరేవును మూసివెయ్యాలనిదొరతనంవారాలోచిస్తున్నారు. దొరతనంవారుమాకు ప్రత్యేకసదుపాయమును చెయ్యలేదు. ఇక్కడ యీ నౌకానిర్మాణస్థానమును మేముకట్టించడంవల్ల యీ రేవుకు అనేకవిధాలుగా ఆదాయం చాలా అధికమవుతుంది. సర్ అలెగ్జాండరుగిబ్బుకంపెనీవారిసలహాను మేము కోరాము. ఆకంపెనీ ప్రధానభాగస్వామి ౧౯౪౦సెప్టెంబరులో ఇంగ్లాండునుంచి ఇండియాకువచ్చి యీ స్థలమును సాకల్యంగాపరిశీలించి కొన్నిసూచనలను చేశాడు. మేము వెంటనే పనిప్రారంభించాము. ౮-౧౦ వేలటన్నులుగల రెండుస్టీమరులను ఒకసంవత్సరంలోనిర్మించవచ్చును. కనీసం ౨ స్టీమరులైనా నిర్మించవలెనని మేముఆలోచించాము. సర్ గిబ్బు కంపెనీవారిపరిశీలనక్రిందనే పనిఅంతా జరుగుతూవుంది. యిదిపూర్తిఅయితే ౮-౧౦ వేల టన్నులు గల ౯ స్టీమరులను ఒక సంవత్సరంలో కట్టించవచ్చును. దీనిలో ౭-౧౦ వేలమందిపనిచేస్తువుంటారు. వారందరునివసించడానికి దీనికి చేరువగావున్న మూడువందలయకరాల భూమిని చేరమాడుతున్నారు. ౧౯౪౧సంవత్సరంముగిసేలోగా దీనిని కొంటాము దీనిలో నవీనపద్ధతిని సకలసౌకర్యాలతోనుకూడిన ఇళ్ళను కట్టిస్తాము.

దీనికికావలసిన ఉక్కును, యంత్రాలను ఇంగ్లండునుంచి తెప్పించవలెనని అనుకున్నాము. అమెరికానుంచి వీటిని తెప్పించవలసిందని ఇండియాదొరతనంవారు సలహాయిచ్చారు, మేము మా ప్రవీణులను అమెరికాకుపంపించాము. యుద్ధసన్నాహాలలో ఒకభాగంగా యిండియాలోవర్తకపునౌకలను కట్టించడానికి ఇండియాదొరతనంవారంగీకరించలేదు. యీరాయబారాలతో మరి ౬ నెలలుగడిచిపోయాయి. అమెరికానుంచి యీ సామానులువస్తేగాని యీస్థలంలో నౌకలను కట్టించడానికివీలులేదు. దొరతనంవారు అనుమతినిస్తే మేమిక్కడకట్టించే స్టీమరులునన్నిటిని యుద్ధంముగిసేవరకు న్యాయమైనషరతులమీద దొరతనంవారి స్వాధీనంలోవుంచుతామని మేము దొరతనంవారికి తెలియజేసినా వారంగీకరించలేదు. అందువల్ల ఇంగ్లాండునుంచి యంత్రాలు పుష్కలంగా ప్రావలరులు మొదలైనవేవీరావు. బ్రిటను దేశంలోనుంచి ఒకనౌకానిర్మాణస్థానములోని అన్నిభాగాలను పూర్తిగాస్టీమరులమీద ఇండియాకు తెప్పించి వాటిని విశాఖపట్టణంలో అమర్చవలెననికూడా మేముఆలోచించాము. అదికూడాకొనసాగలేదు. ఇండియాదొరతనంవారు బ్రిటను దొరతనంవారికి మనఃపూర్వకంగా వ్రాస్తేగాని యిదిజరగదు.

## చాలానౌకలు వెంటనేకావాలి

యుద్ధం తీవ్రంగాజరుగుతూవుంది. చాలానౌకలువెంటనేకావాలనిఅన్ని దేశాలవారున్నూ కోరుతున్నారు. సైనికులను ఆయుధసామాగ్రులను ఇతరసామాగ్రులను తీసికొనివెళ్ళడానికిన్నీ వర్తకపుసరుకులు దిగుమతి ఎగుమతులనిమిత్తమును చాలా స్టీమరులువెంటనేకావాలి. చాలాస్టీమరులు మునిగిపోతున్నాయి. చాలాస్టీమర్లుచెడిపోయాయి కొన్ని స్టీమరులను ఇతరదేశాలవారు వశపరచుకున్నారు. గనుక అన్నిఅధినివేశాలలోను ఇండియాలోనుకూడ స్టీమరులను హెచ్చుగానిర్మించవలెనని వెనుక బ్రిటిషుమంత్రిగావుండిన రోనాల్డు క్రాసుగారు అప్పుడుప్రకటించారు. ఇండియాలో స్టీమరులను ముఖ్యంగాకట్టించవలెనని నిన్నటి అడ్మిరలు హెర్బర్టరిచ్మిజు హెర్బర్టుగారుకూడా రేడియోవుపన్యాసంలోచెప్పారు. ఇండియా దొరతనంవారికిమాత్రము యీపరిశ్రమ ముఖ్యమైనది కాదనితోచింది, కెనడాలోను ఆస్ట్రేలియాలోను నౌకానిర్మాణం అత్యధికంగా జరుగుతూవుంది. బ్రిటిషుదేశానికి కావలసినస్టీమరులనుకూడా యీ రెండుదేశాలలోనుకట్టిస్తున్నారు. వర్తకనౌకలను కట్టించడానికి ఆస్ట్రేలియా దొరతనంవారు ౬౦ లక్షల పౌనులను వ్యయపరుస్తారు. వారు ౯౦౦౦ టన్నుల ఒక స్టీమరునుకట్టిస్తున్నారు. బ్రిటిషు శాసనసభవెలుపలిని దేశాలలోను ఇండియాలోతప్ప తక్కినఅన్ని దేశాలలోనుజాతీయప్రభుత్వాలున్నాయిగనుక ఆదేశాలన్నిటిలోను నౌకానిర్మాణం చురుకుగాజరుగుతూవుంది, ఇండియా దొరతనంవారివైఖరి నాకత్యధికమైన విషాదమును కలిగిస్తూవుంది.

## అమెరికా అధ్యక్షుడు రూజువెల్టుగారి హెచ్చరిక

“బ్రిటనులో అన్ని నౌకానిర్మాణస్థానాలలోను ఒకనెలలో ఎన్నినౌకలను నిర్మించగలుగుతున్నారో వాటికిమూడురెట్లుహెచ్చుగా నాజీలు వర్తకనౌకలనుముంచేస్తూన్నారు, అమెరికాలోను బ్రిటనులోనుకలిసి యిప్పుడు తయారవుతూవున్న స్టీమరులకు రెట్టింపుస్టీమరులను నాజీలుముంచేస్తువున్నారు” అని అమెరికాఅధ్యక్షుడు రూజువెల్టుగారీమధ్యనే స్పష్టంగాచెప్పారు.

“ఇప్పుడు ఇండియాలో స్టీమరులను కట్టడం ప్రారంభిస్తే అవి ౩ ౪, యేళ్ళకు పూర్తికావు. అంతవరకు యుద్ధం జరుగుతుందనితోచదు గనుక ఇండియాదొరతనంవారు ఇండియాలో వాణిజ్యనౌకలనిర్మాణమును ప్రోత్సాహపరచదలంచుకోలేదు. అని ఇండియా ప్రభుత్వం వాణిజ్యసభ్యుడు సర్ రామస్వామి మొదల్యారుగారన్నారు. దొరతనంవారనవసరంగా ఆలస్యంచేశారు, ఇప్పుడయినా వారు మనఃపూర్వకంగా మాకుసహాయంచేస్తే ౧౯౪౨ డిశంబరు నెలాఖరులోగానే చాలా స్టీమరులుతయారగునని నేనువాగ్దానంచేస్తూన్నాను. మేముకోరినవెంటనే దొరతనంవారు సహాయంచేసినట్టయితే యింకాచాలాముందుగానే నౌకలు తయారైవుండును.

## అసాధ్యములైన షరతులు

ఇండియాలోని ఇంగ్లాండులోను మేముచాలాప్రయత్నంచేసినందున కొన్ని యంత్రములకున్నూ కొంతవుక్కుకున్నూ మాకు “ప్రథమ హక్కును” (ప్రియారిటీ) దొరతనంవారిచ్చారు. ఈనౌకాశ్రయంనిమిత్తం దొరతనంవారు ప్రత్యేక ప్రథమహక్కు అనిస్తారని మీరుభావించకూడదు” అనిఅధికారులు మాకుస్పష్టంగా తెలియజేశారు— దొరతనంవారసాధ్యములైనషరతులను కోరుతున్నారు.

## ఇతరదేశాలలో నౌకలనిర్మాణం

ప్రయాణీకులకు తగిననౌకలను యుక్తప్రామాణ్యతగలనౌకలనునిర్మించడానికి ౧౯౨౬-౧౯౩౭ సంవత్సరాలమధ్య ఇటలీలో ౬,౨౫౦,౦౦౦ పౌనులను వ్యయపరిచారు.

౧౯౨౮-౧౯౩౬ల మధ్య ఫ్రాన్సులో ౪౬,౪౦ లక్షల పౌనులను వ్యయపరచారు ౧౯౩౫-౩౬లో హాలెండు (నెదర్లాండ్సు)లో ౧౫౧౫౦౦౦ పౌనులను వ్యయపరచారు, ౧౯౩౪ ౨౪ నాట్సువేగమును ౨౬౦౦౦ టన్నుల బరువునుగల పెద్దడీలక్సు ప్రయాణీకుల స్టీమరులను కట్టించడానికి జపానువారు ౨౫౦ లక్షలయెన్నులను వ్యయపరిచారు. ౧౯౨౯ తరువాత నౌకానిర్మాణంనిమిత్తం జపానువారు ౬౫౦ వేల పౌనులవ్యయపరిచారు. చిరమిలాను జపానులోకట్టించబడిన నౌకలవ్యయంలో సగంవ్యయమును దొరతనంవారిచ్చారు. వీరు౧౯౩౬-౩౭లో ౩లక్షలపౌనులనువ్యయపరిచారు. బ్రిటనుదొరతనమువారు తక్కువవేటుకు ౨౩,౪౩౨,౪౮౦పౌనులను బదులిచ్చారు. ౧౦౦కిసాలుకు ౧ ౧/౨ వడ్డీ ప్రకారం బ్రిటను ట్రేడుబోర్డువారు ౯౫౬౦౦,౦౦౧ పౌనుబదులిచ్చారు. ౧౯౩౭-౩౮లో కూనార్డు వైటుస్టారు లిమిటెడుకంపెనీకి బ్రిటనుదొరతనమువారు ౩౧,౦౨,౪౫౫పౌనులు బదులిచ్చారు. ౧౯౫౫వరకు యీకంపెనీవారిబదుళ్లను తీర్చనక్కరలేదు' అనగావీరికి ౩౬ యేళ్ళగడువుయియ్యబడెను. ఒకస్టీమరు ౨౦యేళ్ళకంటె హెచ్చుకాలం మన్నదు, గనక అప్పటికివారుకట్టించిన స్టీమరులేవి వుండనేవుండవు ౧౯౩౯మార్చి౩౧వ తేదీకి దొరతనమువారికి వసూలుకావలసిన బాకీ మొత్తం ౨౩౦౬౯౩౩పౌనులు ౧౯౩౯లో బ్రిటనుదొరతనమువారు కోటిపౌనులను శాంక్షను చేశారు. దీనిలో ౪౫లక్షలనుమాత్రమే బదులిచ్చారు ౧౯౨౪-౧౯౨౭సంవత్సరాలమధ్య బ్రిటనుదొరతనంవారు కూనార్డుకంపెనీ రిసబ్సిడీక్రింద ౩౩౩,౬౯౭పౌనులు యిచ్చారు. ౧౯౪౦జూలైవరకు సబ్సిడీలక్రింద ౩౨౦౦౦౦పౌనులుయియ్యబడెను, ఆస్ట్రేలియాలో టన్నుకు ౧౦-౧౨ ౧/౨ పౌనులవంతున బౌంటీలనుయేర్పరిచారు. ఇంకాఅనేకసదుపాయాలనుకూడా చేస్తున్నారు.

ఇండియా దొరతనంవారిచే నియమించబడిన ఇండియను మెర్కంటయిలు మెరీనుకమిటీవారు తమనివేదికలో చాలాసూచనలను చేసినాగూడా ఇండియాదొరతనంవారు ఇండియాలో నౌకానిర్మాణానికి యేవిధమైనసహాయమును చెయ్యడంలేదు, సింధియాకంపెనీస్థాపకులలో ఒకరైన స్వర్గీయ సర్ లాల్ భాయి శ్యామల్దాసుగారు ఇండియను మెర్కంటయిలు మెరీను కమిటీలో సభ్యుడుగాపనిచేశారు.

## ఇండియాకు స్వరాజ్యం

ఇండియాకు స్వరాజ్యంవస్తేగాని ఇండియాలో నిజమైనపరిశ్రమాభివృద్ధికలగదు కాబట్టి స్వరాజ్యంకోసం దీక్షతో పనిచేస్తూవున్న కాంగ్రెసుమహాసభకు భారతవర్తకులందరు సర్వవిధములాసహాయము చేయవలెను. ఈనౌకానిర్మాణస్థానమును ఆశీర్వదించవలెనని నేనిప్పుడు డాక్టరు రాజేంద్రప్రసాదుగారిని కోరుతున్నాను.

## శ్రీరాజేంద్రప్రసాదుగారు

శ్రీరాజేంద్రప్రసాదుగారు శంకుస్థాపనమొనర్చుచు నిటులనుడివిరి,—

మనం, మనస్వాతంత్ర్యముకొరకు పోరాటం ఇంకాసాగిస్తూనేవుండాలి. విదేశీయపరిపాలనయున్నంతకాలం, విదేశీయులీదేశపుఆర్థిక సంపత్తిని లాగుకొని పోవుచునేయుందురు. ఆరెంటికినిగల సంబంధం అవినాభావమైనది. రాజకీయస్వాతంత్ర్యము ప్రజలకులభించినగాని ఆర్థికపారతంత్ర్యమునుండి బయటపడజాలము.

భారతదేశమున తిరిగి నౌకానిర్మాణపరిశ్రమను నెలకొల్పుటకు సింధియాస్టీం నావిగేషను కంపెనీవారు తలపెట్టినమహాకార్యము ఎంతయు అభినందింపదగియున్నది. యీ మహాకార్యమున భారతదేశమునందందరి సహాకారమును సంపాదించెదరనియు కార్మికతరగతుల సౌకర్యములనుపేక్షింపరనియు ఆశించెదను.

క్రీస్తుపూర్వము ౧౦౦౦ సం॥నుండి [illegible] ౨౦౦ సం॥వరకు భారతీయులు చైనా, జపాను దేశములవరకు నౌకలనంపి అపారమగు సముద్రవాణిజ్యమును సాగించుచుండిరి. భారతదేశమునకును చైనాకునుమధ్యగల దీవులన్నియు భారతీయులు పరిపాలించుచుండెడివారు. క్రీ. పూ. ౭౦నుండి క్రీ.శ.౧౨ వందలవరకును భారతదేశపునౌకావాణిజ్యమును, సముద్రాంతర దేశములతో సంబంధములును మహోన్నతస్థితియందుండెను. ఆకాలమున భారతీయనావికుల ధైర్యసాహసములును, చాకచక్యమును, జగత్ప్రసిద్ధిచెందినవి నేటికిని వీరు, అవకాశము [illegible], ఇతరులెవ్వరికినిగూడ ఏమాత్రమును వెనుదీయరను విషయము ఋజువుచేయుచున్నారు.

౪ వ పేజీ చూడుడు

# గోలకొండపత్రిక

వృషనామసం॥ర ఆషాఢ శు॥ ౨

గురువారము


# భారతీయ నౌకా నిర్మాణము.

శనివారమునాడు విశాఖపట్టణం రేవులో సింధియానౌకా సంఘమువారు ఓడలనిర్మించు కార్యాలయమును స్థాపించినారు. దాని ప్రారంభోత్సవము భారతకాంగ్రెసు అధ్యక్షులైన రాజేంద్రప్రసాదుగారు జరిపినారు. శంకుస్థాపనము శాస్త్రోక్తముగా బ్రాహ్మణుల మంత్రాలచేతను పూజా పునస్కారములచేతను చేయబడినది. అనేక సుప్రసిద్ధదేశనాయకులచ్చట కూడిరి. గాంధీటాగూరువంటి మహామహులు చాలామంది ఆశీర్వాదాలపంపిరి. అచ్చటజరిగినసభ ఒక పిల్ల కాంగ్రెసువలె నుండెను అని పత్రికలలో వర్ణించినారు. ఇంతటి ప్రాముఖ్యత దీనికెందుకియ్యబడినది? ఇంగ్లాండులోను అమెరికాలోను ఎక్కడబట్టితే అక్కడ నౌకానిర్మాణ కేంద్రాలున్నవి. లెక్కలేనన్ని ఓడలుఎల్లప్పుడునునిర్మింపబడును. ఒక్కొక్కమారు ఒక్క ఓడపైననే ౫ కోట్లరూపాయీలు ఖర్చుచేసి నిర్మించుదురు. అచ్చట యిట్టి సన్నివేశాలు మనము వినుటలేదు. దీనికి కారణమేమనగా దరిద్రులకుపెన్నిధి దొరికితేఎట్లుండునో ఏమిన్నీ లేనిచోట ఏదైనా ప్రారంభించితే అదేమనకు పదికోట్లు. అయితే పూర్వముమనలోనిట్టి నిర్మాణాలు లేకుండెనా? అముచ్చట యంతయు ఇంగ్లీషువారీ దేశాన్ని పాలించుటకు పూర్వముండినట్టిది. ఇంగ్లీషువారు బాగాస్థిరపడిన తర్వాత ౧౦౦ వండ్లనుండి భారతీయులకు నౌకానిర్మాణాలు లేకపోయెను. సింధియాకంపెనీవారు ప్రారంభించిన విశాఖపట్టణ నౌకానిర్మాణ కేంద్రమే మొట్టమొదటిగా నున్నది.

ప్రాచీనకాలములో అనగా ఋగ్వేదకాలములో భారతీయులు చతుస్సముద్రములలో నౌకలలో తిరుగుచుండిరనియు, వ్యాపారముచేయుచుండిరనియు నిదర్శనాలు ఋగ్వేదములోనేయున్నవి ఈ వివరణను బాగుగా ముఖర్జీగారు తమ భారతీయ నౌకాచరిత్ర అనుఆంగ్ల గ్రంథములో నిరూపించియున్నారు. సుమారు ౪౦౦౦ వండ్లక్రిందట భారతీయులు తమ సన్నని నూలు బట్టలను ఈజిప్టు (మిశ్ర) రాజులకమ్ముచుండిరి. తురుష్క ప్రాంతములోని ఛాల్డియా ఫీనీషియా దేశాలతో వర్తకము విరివిగా చేయుచుండిరి. ఆకాలములో సముద్ర ప్రయాణంచేస్తే కులంతప్పు అన్న అంశ లేనే లేకుండెను.

అయితే ఆంధ్రులు సముద్రవ్యాపారాలు చేసిన జాతియేనా అని పలువురు శంకించవచ్చును. వేయింటిలో ఒక్కరుకూడా ఆంధ్రులు నౌకావ్యాపారాలుచేసిన జాతి అని యెరుగరు. ఏదేశాన సముద్రతీరముండునో ఆదేశము తప్పకుండా సముద్రప్రయాణము చేయునట్టిదనియు, నౌకావ్యాపారములో ఆరితేరినదై యుండునదనియు, ఆజాతిలో మంచి నావికులుందురనియు స్థూలముగా గ్రహించవచ్చును. ఆంధ్రులకు మంచిపొడవైన సముద్రతీరము పూరీనుండి మద్రాసువరకున్నది. ఇంతటి వైశాల్యములోవారు బందరు, మోటుపల్లి, మున్నగు రేవులను చాలాయేర్పాటు చేసుకొనియుండిరి. అతిప్రాచీనములో అంధ్రులు చీనావరకు వ్యాపారముచేసినారు కాంబోడియాలోను బర్మామలయాలోను విశేషముగా ఉంటూ వచ్చినారు. జవా (యవద్వీపము) సుమిత్రా బోర్నియో ద్వీపాలలో వలసలను కూడా ఏర్పాటు చేసినారు. హిందూ బౌద్ధమత వ్యాప్తిని చేసినారు. ఇప్పటికిని జవాలో ఆంధ్ర చిహ్నములున్నవి. అటు పశ్చిమములో రోముతో వ్యాపారముచేసినట్లున్నది. దక్షిణాపథములో ప్రాచీనరోమక నాణెములు లభించినవి. ప్లినీ ఆకాలము ఆంధ్రుల జీవితములు వర్ణించెను. ఈ విధముగా కొండవీటి రెడ్డిరాజుల సామ్రాజ్య పతనమువరకు ఆంధ్రులు నావికులై ప్రఖ్యాతి పొందియుండిరి. అటు తర్వాతవారు పడిపోయిరి.

తమిళులు కూడా తక్కువవారు కారు. వారును ఆంధ్రులవలెనే పాశ్చాత్యదేశాలతోను ప్రాచ్యదేశాలతోను విరివిగా వ్యాపారము చేసియుండిరి.

వారి తర్వాత మహారాష్ట్రులు విజృంభించిరి. ఇటు తూర్పులో ఆంధ్రులెట్లో అటు పశ్చిమంలో మహారాష్ట్రులును సముద్రతీరవాసులగుటచే మంచి నావికులై యుండిరి. మొన్న మొన్నటివరకు అనగా ఔరంగజేబు చనిపోవు వరకు వారు మంచి నౌకాబలముకలవారై యుండిరి. శివాజీకాలములో ఆంగ్రేఅను సుప్రసిద్ధ నౌకాసేనాని గొప్ప నౌకాబలముతో పోర్చుగీసువంటి పాశ్చాత్య నౌకలను చెదరగొట్టి ఓడించియుండెను. నానాఫడ్నవీసు కాలములో కూడా ఒక మారు ఆంగ్లేయులతో మహారాష్ట్రులకు నౌకాయుద్ధము జరిగియుండెను.

కాని భారతీయుల నౌకాబలానికి మాధ్యకాల మాసన్నమయ్యెను. ఇంగ్లీషువారు దేశాన్ని వశపరచుకొన్న తర్వాత భారతీయుల నౌకా పరిశ్రమ వ్యాపారము, నావలు, అన్ని గారడివాని ప్రదర్శనమువలె ఊరుపేరు గుర్తు జాడలేకుండా మాయమైపోయెను. దీనికి కారణము ఆంగ్లేయుల వ్యాపారాభివృద్ధి, వారి వ్యాపారుల స్వార్థత. పాశ్చాత్య యంత్రాల దండయాత్ర 'బ్రిటిషు ప్రభుత్వవిముఖత' ఇట్టివెన్నో కారణభూతమయ్యెను. ప్రపంచములో ప్రతిదేశములోను ఒక మర్యాదవర్తించుచున్నది. ఏదేశము సముద్రతీరము ఆదేశానిదే అయియుండును. ఇటలీ సముద్రతీరాన్ని జపాను పట్టుకొని అదినాహక్కు అననేరదు. ఇంగ్లీషుతీరాన్ని అమెరికాకోరజాలదు. కాని మన భారతదేశము యొక్కసముద్రతీరము ౫౦౦౦ మైళ్ళకు మించినదైననుమనతీరములో మనకుహక్కులేదు. ఇప్పుడు ఓడల సంఖ్యప్రపంచములోని అన్నిదేశాలపైకి ఇంగ్లాండులో ఎక్కువగా కలదు. ౧ కోటి ౮౦ లక్షల టన్నుల బరువుకల ఓడలు ఇంగ్లీషువారికున్నవి. మరియింగ్లాండు స్కాట్లండు ఐర్లండు మూడును కలసి యెంతఉండునో అంతకన్న ౧౨ అంతలు పెద్దదేశమైన ఇండియాకు ౧ లక్ష ౬౪ వేల టన్నుల ఓడలున్నవి. అనగా ప్రపంచములో నౌకాబలములో ఇంతకంటె హీనస్థితిలో నున్న దేశము మరొకటి లేదన్నమాట మనదేశ తీరములలో రేవులలో విదేశీ ఓడలు నూటికి ౭౪ పాళ్లు ఉన్నవి. హిందూస్థానీ ఓడలు నూటికి ౨౬ పాళ్లున్నవి. ఈ ఓడలలోని వ్యాపారము చూచితే మరీ విపరీతముగా ఉన్నది. ఇంగ్లీషువారి ఓడలలో మన తీరములో నూటికి ౯౩ పాళ్ళ వ్యాపారము జరుగుచున్నది. ఇట్టివివరణను మంద్రాసు హిందూ పత్రిక చాలా బాగుగా అతివిలువుగా ప్రకటించియున్నది. ఏదోవిధంగా ధైర్యము చేసి సింధియా కంపెనీవంటివారు కొన్నికోట్లు వ్యయముచేసి ఓడలను పెట్టుకొనగా ఇంగ్లీషు ఓడలు పోటీనివహించ లేక నష్టపడికూడా చాలా తక్కువరేట్లతో సరకులను ప్రయాణీకులను తీసుకొనుచు వెళ్లిరి, దానితో హిందూస్థానీ కంపెనీలకుకోట్లకొలదినష్టమువచ్చెను. ఎన్నియో మారులు మాదేశతీర వ్యాపారముమాకే ఉండవలెను. అను శాసనమును భారతీయ శాసన సభలో ప్రవేశపెట్టిరి. కానిలాభములేకపోయెను. బ్రిటిషు ఇండియా ప్రభుత్వము ఏమాత్రమును సానుభూతిచూపలేదని సింధియా కంపెనీ యజమానులగు వాల్చందు హీరాచందుగారును, రాజేంద్రప్రసాదుగారును మొన్నటి నౌకాస్థాపనోత్సవకాలములో నిరూపించియున్నారు. హీరాచందు వాల్చందు గారు కోటీశ్వరులు. నిరాడంబరులు,గొప్పదేశభక్తి కలవారు. పట్టుదల అపారంగాకలవారు. ఎంతటి నష్టము కలిగినను అధైర్యపడనివారు. వారికిఆటంకములు కలుగక నష్టములులేనట్లుగా పరమేశ్వరుడే రక్షించవలెను. మంచికాలము రాకమానదు. భారతీయులందరును ఈ నౌకానిర్మాణాన్ని అశీర్వదించు చున్నారు.

---

## ఆదర్శ వివాహము

హైదరాబాదు (దక్కను)

౧౬-౬-౪౦ ఆదివారం ఉదయము పదిగంటలకు హిమాయతునగరమందుగల "మునివిహారాశ్రమము"లో శ్రీపండిత ధూళిపేట రాజరత్నాచార్యులవారి జ్యేష్ఠకుమార శ్రీయుత దీనబంధుగారివివాహము శ్రీమతిసత్యవతీదేవి గారితో జయప్రదముగాజరిగినది.

వరుడు ఉత్తరప్రాంతీయకాన్య కుబ్జబ్రాహ్మణవంశీయుడు, వధువు వధిరతాలూకా ఆంధ్ర నియోగి బ్రాహ్మణ కన్య.

వివాహమున పాల్గొనిన ప్రముఖులు:

శ్రీమాన్ రాజాశివప్రసాద్ ఆర్యగారు
,, ,, ఓంకారప్రసాదుగారు
,, డాక్టరు ముత్యాలగారు
,, కే. పుల్లారెడ్డి వకీలు గారు
,, యన్. కనకయ్య గారు
,, శేషాచారిగారు
,, బాబు సత్యేన్‌చందుగారు
,, రామచంద్రరావుగారు
,, యం. వెంకటేశ్వరరావు

మొదలగువారేకాక వధూవరుల బంధుమిత్రులనేకులు స్త్రీపురుషులుపాల్గొనిరి. వివాహకర్మ ముగించగానే గృహస్థాశ్రమ ధర్మాలను గురించి పలువురుప్రముఖు లుపన్యసించిరి. తదనంతరము భోజనతాంబూలాది సత్కారములగైకొనివచ్చిన సదస్యులు పగలు౨గంటలకు ఎవరియిండ్లకువారు వెడలిరి.

---

### ప్రథమ భారతీయ నౌకానిర్మాణ పరిశ్రమ

౩ వ పేజి తరువాయి

నౌకానిర్మాణవిషయమున, ౧౭౪౦సం॥వరకును. భారతదేశము ప్రపంచమున అసమానమైనదను ఖ్యాతిని సంపాదించెను. ఆంగ్లదేశమునందు నిర్మింపబడిన వానికంటె, ఈదేశమునననిర్మింపబడినవి, చాల సౌష్టవముగ చాలాకాలమువున్నవిగనుండుననియు, ఖర్చుకూడచాల తక్కువనియు ఆంగ్లేయులే అంగీకరించిరి. బ్రిటిషువారు ౧౦౦ సంవత్సరములకాలము, తమకు కావలసినఓడలను బొంబయియందు భారతీయులచే నిర్మించుకొనిపోవుచుండిరి. ౧౭౪౦ సం॥వరకును వ్యవహారము లీవిధముగనుండెను.

కాని"స్టీంఇంజను"లువచ్చుటతో ౧౭౪౦ సం॥నుండి పరిస్థితులుమారెను. అప్పటినుండియు కర్రతోనిర్మింపబడు ఓడలుపోయి, ఇనుముతోనిర్మింపబడుస్టీమరులువచ్చెను, స్వతంత్రముగనున్న దేశములు, తమపరిశ్రమయందీమార్పులుగావించుకొని నౌకానిర్మాణపరిశ్రమను యథాపూర్వకముగ నిర్వహించుకొనుచున్నది కాని భారతదేశము పారతంత్ర్యమునబడుటచే బ్రిటిషుదేశమందలి నౌకానిర్మాణపరిశ్రమపోటీవలన, భారతీయ నౌకాపరిశ్రమ శిథిలముగావలసివచ్చెను.

అయినను భారతీయులు దిగులుచెంది యూరకొనలేదు. ౧౮౬౦ సం॥ నుండి ౧౯౨౫ సంవత్సరమువరకు రు ౪౬ కోట్లకు తక్కువగాని పెట్టుబడితో ౧౦౨ నౌకాకంపెనీలను ప్రారంభించిరి. వానిలో చాలభాగము బ్రిటిషుకంపెనీల పోటీలవలనశిథిలమైపోవలసివచ్చెను వానిపెట్టుబడిసొమ్ము౹గూడ ౫ కోట్లవరకు నష్టమైపోయెను, ఈపోటీవలననే ౧౯౦౪నుండి ౧౯౨౭ వరకు ౨౪ భారతీయనౌకాకంపెనీలు దివాలాతీయవలసివచ్చెను బ్రిటిషుకంపెనీలు, ఎట్టిఅక్రమమగుపోటీలకుదిగి దేశీయకంపెనీలను శిథిలమొనర్చుటకు ప్రయత్నించునో, సింధియాకంపెనీకి అనుభవపూర్వముగ నెరిగియుండును.

#### నిరాశకు కారణములేదు

ఇప్పుడు ఈఒక్కవిషయముమాత్రము నేను చెప్పుదును. కాంగ్రెసు ప్రస్తుతము అధికారమునకు దూరముగానుండవచ్చును తాత్కాలికముగా కాంగ్రెసును అణచివేయవచ్చును—కాని ప్రజలస్వాతంత్ర్యవాంఛ స్థిరముగా నాశముచేయ నెవ్వరితరమునుగాదు. కృత్రిమముగా ప్రజలజాతీయాశయములను వెనుకకుమరల్ప నెవ్వరికినిశక్యముకాదు. రేపోమాపో మనయింటికాలముచెప్పులమనకులభించును భారతదేశక్షేమమునకై భారతదేశముయొక్క ఆర్థిక పారిశ్రామిక, కోశసంబంధములైన పూలసీలను మనమేనిర్ణయించుకొనుస్థితిరాగలదు, ఈనాడుసానుభూతి, నైతికసహాయముమాత్రమే మేము చూపగలిగి యుండవచ్చును. నిరుత్సాహపడిన మిమ్ములను మాటలతో నోదార్పగలస్థితియందుమాత్రము నేడు మేముండవచ్చును—కాని రేపునుదిరెప్పటికినుండును—భారతజాతికి ముందుమంచిరోజులు తప్పకవచ్చును. కావున నిరుత్సాహమునకు కారణమావంతయు కనబడదు. మనప్రయత్నములు అనేకసార్లు విఫలమైనను నిరుత్సాహపడక దేశసేవచేయుచుండవలెనని కీ॥శే॥ గోపాలకృష్ణగోఖ్లేగారునుడివియుండిరి. ప్రతికూలమగు నెనేకస్థితులు మీరెదుర్కొంటిరి. బ్రిటిషు స్వలాభాపేక్షపరుల ప్రాతికూల్యము మీకు మెండుగానుండెను—ఐనను మీకంపెనీ నిలువగలిగెను— నిలుచుటమాత్రమేగాక నౌకా ప్రపంచములో మీకుపేరు ప్రతిష్ఠలుకూడ కలిగియుండెను—ఇట్టిసందర్భమున భారతదేశవాణిజ్యాభివృద్ధికై అన్నిరకములఓడలు నిర్మించు మీయుపాయత్నము అచిరకాలములో ఫలించునని నేనునిస్సంశయముగాచెప్పగలను. ప్రస్తుతప్రభుత్వములు మీశ్లాఘాపాత్రమగు ప్రయత్నమునకు సహాయంచేయజాలకపోయినచో ఈదేశమునందలి పరిపాలనావిధానమునందు జాతీయదృక్పథమెంతకొరగడియున్నదో, భారతదేశక్షేమమునెట్లు విచారింపక తమదేశక్షేమము నెట్లువిచారించుచున్నారో స్పష్టముకాగలదు. ఇట్టిపరిపాలనావిధానము చాలకాలముసాగజాలదు. ఎందువలననగా అదికాలమునకు తగినదికాదు. ప్రజలకు అయిష్టమైనది. ఈపరిపాలనావిధానము తొలగినప్పుడు యిన్నాళ్ళనుండియు మీరుపడుచున్న కష్టములు, మీకుకలిగినఅన్యాయములు తప్పకతొలగిపోవును— కావున నిరాశచెందకుడు

#### "గాంధిగ్రామం"

నేడు ప్రారంభించుచున్న సింధియా నౌకానిర్మాణస్థానమునకు "గాంధిగ్రామం" అనిపేరు పెట్టనిశ్చయించిరి.

ఇచటకార్మికులకు యిండ్లు రూ ౪ లక్షలు ఖర్చుపెట్టికట్టెదరు. అప్పుడే రూ ౨ లక్షలు ప్రారంభకార్యములకై ఖర్చుచేసిరి

(ఆంధ్రపత్రిక)

---

## అ. భా. మున్నూరు సంఘము

౧౪ఖుర్దాదు ౧౩౫౦ హైదరాబాదులోజరిగిన మహాసభలో యీక్రింద సుదహరించినవారలు భారత తెలుగు మున్నూరువారి యొక్క స్థాయి సంఘసభ్యులుగా ఎన్నుకొనబడినారు.

మ.రా.శ్రీ. పెద్ది సర్వయ్యగారు
,, యం. లక్ష్మీనర్సయ్య గారు వకీలు.
,, యస్. జగన్నాయకులుగారు
,, బొజ్జం నరసింహులుగారు.

---

## ఆంధ్రాధ్యక్షులు కోల్హాపూరుకు వెళ్లుట

ఆర్ నారాయణరెడ్డి ఆంధ్రమహాసభాధ్యక్షులుంగారు కోలాపూరు తాండూరు ప్రాంతాలలోనిపరిస్థితులను స్వయముగాకనుగొనుటకు వెళ్ళి పరిస్థితులన్నింటిని విచారించుకొని నిన్నటిదినం వాపసువచ్చినారు. వారొకనివేదికను సిద్ధముచేసినారు. అది ముందుపత్రికలలో ప్రకటింపబడును. వారివిచారణలో కోల్హాపూరులో వైద్య సహాయము జాతరకాలంలో ఏమిన్నీ లేకుండెననియు, జాడ్యము కలరాయేఅనియు ఒకేభావి జాతరస్థలములోఉన్నదనియు, ౨౦౦౦కు పైగానే చనిపోయినారనియు, ఇప్పుడు మంచినీళ్ల వ్యవహారం రుజుగుచున్నదనియు తెలిసినది.

---

## అభినందన సభ

శ్రీమతిరంగమ్మ ఓబలరెడ్డిగారిని అభినందించుటకు హైదరాబాదు అలియాబాదులో రెడ్డి మహిళాసభవారు ౨౭అమర్దాదునాడు ౩గంటలనుండి శ్రీమతిశిరోజాదాయిగారి అధ్యక్షతలోఅలియాబాదుతెలంగాణలోని రా॥బ॥ వెంకటరామారెడ్డిగారికోటలో సభ చేయుచున్నారు.

---

## ఆర్యసమాజ ప్రచారము

కపిరియాల [కామారెడ్డితా॥]

దిగ౫-౬-౫౦ఆ శుక్రవారం ఆర్యసమాజము కపిరియాలలో శ్రీ.డివి, స్వామి ఆర్యప్రచారకులు నిజామాబాదుగారు ఉదయంఆర్యసమాజములోహవనముచేసిరి హవనంలో౫౦ంమందిపాల్గొనిరి అంతాయజ్ఞోపవీతములుధరించిరియజ్ఞోపవీతముమహత్తుస్వామిగారు తెలుగులోబోధించిరిఆర్యసమాజము ప్రపంచములోయేమిచేసినది గంభీరముగాచెప్పిరి. సాయంత్రం సత్సంగంవిషయాలు ౩గంటలకు సంధ్య. భజనసంఘటన విషయాలలోచెప్పిరి యువకులుఆనందించిరి—

---

## ఉస్మానియా సంస్కృత పండితుడు

ఉస్మానియా విద్యాపీఠకళాశాలలో సంస్కృత ప్రొఫెసరుపనిపైన అరవిందుశర్మఅనువారను యూనివర్సిటీవారిని నియామకముచేయనున్నారని అనుకున్నారు. ఈపదవికై హైదరాబాదులోని పండిత చిత్తలకేశవశర్మగారును కురుగంటిసీతారామయ్యగారు మున్నగువారును అభ్యర్థులుగానుండిరి,

---

## కాశ్మీరులో బహుపతిత్వము

కాశ్మీరులో సుమారు ౮౦వేలమంది బౌద్ధులున్నారు వారిస్త్రీలు పలువురుభర్తలను చేసుకొనుచుండిరి. అనగా ఒకయింటిలో అయిదుగురన్నదమ్ములుంటే పాండవులవలె వారందరును ఒకేభార్యనుచేసుకొనేది. ఈ కాశ్మీరుబౌద్ధులు లడాఖ్ జిల్లాలోఉన్నారు. వారువ్యవసాయకులు. ఒక కుటుంబములోన అన్నదమ్ములు సైతలావారానికి విరుద్ధముగా సమిష్టిభార్యనుపదలి వేరేపొందభార్యను చేసికొన్నట్లయితే వానికిసమిష్టిభూమిలో భాగములేకుండెడిది.

ఇప్పుడు కాశ్మీరుమహారాజాగారు అసంస్థానము శాసనసభవారు పై ఆచారాన్ని రద్దుపరచుచు ఇకమీదబహుపతిత్వము శాసనవిరుద్ధముఅనిశాసించిన శాసనముపై సంతకముపెట్టినారు.

---

### భాగ్యోదయ

హిందీలో భాగ్యోదయ అనుపేరుతో ఒక వారపత్రిక హైదరాబాదునగరమునుండి వచ్చుచుండెను—అదిప్రోత్సాహంలేక ఆగిపోయెను—మరలకొందరు ప్రోత్సహించుచున్నందున మళ్లీప్రారంభంకానున్నది,

## వి. రామచంద్రరావుగారు

శ్రీ శేషుశైన వామన్ నాయకుగారి ఊరేగింపు సంబంధమున అరెస్టుకాబడిన శ్రీవందేమాతరమ్ రామచంద్రరావు గారిని ౧౩౫౦అమర్దాదునాడు హైకోర్టుకు పేష్కీశైతీసుకొనిరాగా వాజిద్ గారి ఆజ్ఞప్రచ్ఛక దర్శించితిని వారి ముఖవర్చస్సును బట్టి వారుమిక్కిలిచిక్కిపోయినట్లున్నారు. జైలు ప్రవేశమునకు వారితూకము ౧౩౨పౌండ్లుండినది. ప్రస్తుతమువారితూకము ౧౨౮లేక ౧౩౫పౌండ్లకంటెఅధికముగ తగ్గినట్లున్నది. దీనికిముఖ్యకారణమేమన, వారిఆహారమునందు మార్పుకలుగుటయే. వారు పండ్లు.పాలు, గోధుమరొట్టె మొదలగువాటినిమాత్రమే భుజించుచుండెడివారు. కానిజైలు వందుప్రవేశించినతరుపరి మామూలిఖైదీలకివ్వబడు ఆహారము (జొన్నరొట్టె,పప్పు) మాత్రమే వారికి దొరకుచున్నది. వారికి కారము, పులుసు. రొమిక్కవళవణము సరిపడవు.

ఇట్లు
వి. వీరభద్రరావు

## ఖమ్మంమెట్టు

కలరా వ్యాపకము

ఇక్కడికి ౩నెలలనుంచి కలరావున్నది. దాని నిఅపుటకై ఆరోగ్యశాఖవారు తగినయత్నములసల్పుచున్నారు కానిఇప్పటికి ౧౦రోజులనుంచి కలరాప్రబలినది విద్యార్థులలోకూడప్రబలినది, ఇప్పటికిఆంవక్లాసువిద్యార్థి కె. దుర్గాప్రసాదురావు కలరావలనచనిపోయినాడు ఇంకాముగ్గురువిద్యార్థులు పడివున్నారు, పాఠశాలకుచుట్టుప్రక్కనున్న బజారులో అనేకులు చనిపోవుచుండుటచే విద్యార్థులుస్కూలుకువెళ్ళుటకే జడియుచున్నారు గవర్న మెంటుడాక్టరుగారు పాఠశాలకువచ్చి ఇంజక్షనులుఇచ్చినారు కాని విద్యాశాఖవారు స్కూలుకుసెలవులుయివ్వలేదు ఇండ్లనుంచి తల్లితండ్రులు విద్యార్థులను తమఇండ్లకు రావలసినదిగా ఒత్తిడికల్గించుచున్నారు, హెడ్మాష్టరుగారు విద్యార్థులకష్టములగమనించి విద్యార్థులకు కలరా తగ్గువరకు శలవులుయిప్పించెదరుగాక!





## ప్రాచీనాంధ్ర నగరము బయటపడుట

బౌద్ధచిహ్నములు దొరుకుట

[కొన్నిదినాలక్రిందట హైదరాబాదురాష్ట్రములో హైదరాబాదునగరానికి ౪౦మైళ్లదూరములో కొండాపురంఅను గ్రామములో పురాతత్వశాఖవారు త్రవ్వి చూడగా ప్రాచీన చారిత్రిక చిహ్నములుదొరికినవని పత్రికలలో ప్రకటింపబడియుండెను. ఇప్పుడుప్రభుత్వమువారు క్రిందివివరాలను ప్రకటనార్థమంపియున్నారు. వీటివలన మరి కొన్ని యంశాలు తెలియవచ్చుచున్నవి. క్రీస్తుశకారంభమునుండి సుమారు ౫౦౦సంవత్సరాలవరకు ఆంధ్రచరిత్రసరిగా లభించకుండావుండినది, ఇప్పుడీఖననమునుండి బయలువెడలినవాటినుండి ఆంధ్రప్రాచీనచరిత్ర కుపకరించు విషయాలుననుకూడగలవు. ఈదృష్టితో ఈఖననము చాలావిలువయైనట్టిది-

గో. ప.]

హైదరాబాదుప్రభుత్వ పురాతత్వశాఖవారు ఏప్రిలుమాసమునుండి హైదరాబాదుపట్నమునకుత్తరదిశలో ౪౦మైళ్లదూరములోనుండినట్టి కొండాపురంవద్ద ప్రాచీనమైనదిబ్బలను త్రవ్వించుచు వచ్చినారు. అచ్చటపూర్వములో ఒకగొప్పఆంధ్రనగరముండినట్లు నిదర్శనములుకనబడుచున్నవి. ఇంతవరకుప్రాచీనశిల్పములు అనగా చైత్యములు, స్తూపములు, గుండ్రనిగదులు, శ్మశానగదులు, విహారములు, మఠములున్ను బయటపడినవి. బయటపడినవానిలో చాలాముఖ్యమైనవి బౌద్ధుల హీనయానమునకుసంబంధించిన తెలుపురాతిలోచెక్కబడిన సుందరమయినవిగ్రహములున్నవి. అవిగ్రీసుకోమనువిగ్రహాలనుపోలియున్నవి. హిందూదేవతాసంబంధమయినవింకను లభ్యముకాలేదు. ఈకొండాపురంలో పూర్వనాణెములుకొన్ని దొరికినవి. అందుకొన్ని క్రీ.శ.౧౫౦నుండి ౧౨౦వరకు రాజ్యమేలిన పులమావియొక్క నాణెములయి యున్నవి, అతనికన్నను పూర్వముండినరాజుల నాణెములు కూడదొరికినవి, అవికొన్ని సీసముతోను రాగితోను అనగా లోహామిశ్రముతోను చేయబడినట్టి నాణెములు, ఈనాణెములచేయుటకు ఉపయోగించిన మూసలుకూడాదొరికినవి. వాటినిబట్టిఆంధ్రరాజులకాలములో నిచ్చటనాణెములు తయారుచేయుచున్నట్లు తెలియుచున్నది, ఇనుముతోచేయబడిన వస్తువులును రాగిఉంగరములు, ఒకటిరెండుబంగారునగలును దొరికినవి. కొన్ని కుండలుఅందమయిన రంగుపనులతోచేయబడినట్టివి లభించినవి.

'ప్లినీ'అను రోముదేశపుసమకాలికచరిత్రకారుడు ఆంధ్రరాజ్యమాకాలములో ప్రాక్పశ్చిమ సముద్రములనావరించియుండెననియు, ఆంధ్రరాజులు క్రీస్తుపూర్వము ౩౦౦నుండి క్రీస్తుశకపిమ్మట ౩౦౦శకమువరకు రాజ్యమేలిరనియు అట్టిదక్కనులోని ఆంధ్రరాజ్యములో ప్రాకారములతోనిర్మింపబడిన ౩౦నగరములునిర్మింపబడినట్లు వ్రాసియుండెను, వాటిలో యిదొకటియని తోచుచున్నది-

ప్రధానమంత్రిగారీస్థలమును తిలకించియున్నారు, విశేషముగా తెలియరానట్టి ప్రాచీనాంధ్రుల చరిత్ర దీనిమూలాన యింకనుఎక్కువగా తెలియగలదని అభిప్రాయపడుచు శ్రీవారుపైస్థలములో యింకనుత్రవ్వవలసినదని ఆజ్ఞాపించినారు-



## సదాశివ పేట

౧౮-౬-౪౧లు ఇక్కడసమీపములోవుండే పెద్దఅమాదిలో ఒకయువతితనయిద్దరుకుమార్తెలసహా భావిలోపడి మరణమొందెను,

చిన్నఅమ్రాదిలో అత్తగారియింటిలో భర్త ఏకారణమువలననో కొట్టినాడనికారణమని అనుకొనబడుచున్నది అందుకుఆయమ్మ అక్కడకు సమీపములోనుండే పెద్దఅమ్మాదికివెళ్లి మోటభావిలో మొదలుతనఇద్దరికూతుళ్లనుపడవేసి కడపటి యూడోకూతురును పడనూకగా ఆకస్యాతప్పించుకొనిపరుగత్తైనట. అనంతరము ఆమెబావిలోకి దుమికిప్రాణముల గోల్పోయెను.

## పెద్దేముల

పెద్దేముల ౧౮-౬-౪౦:

ఈగ్రామంలో ౨౦దినములనుండి కలరావ్యాధి కొత్తాపురం యెల్లమ్మజాతర నీళ్ళగాలియిక్కడకూడావిపరినది. చాలాజనులు యాత్రికులు చనిపోయిరి. బీదలకుయిట్టికాలంలో పనిలేకడబ్బు దొరకడంకష్టం. ప్రతిసంవత్సరం కలరాప్రారంభించగనే దేవీపూజకైగ్రామంలో చందాప్రోగు చేయుచుండిరి. కానియిప్పుడుచందామరియు పశుబలితప్పినది. కలరామూనాతగ్గిపోయినది. గ్రామంవీధులలో యెరుపుచెత్త పెంటగుంటలుచాలమట్టుకువున్నవి. జిల్లాగుల్బర్గానుండి డాక్టరువచ్చి యిక్కడబసచేసి కలరానివారణ టీకాలు యితరగ్రామాలకువెళ్ళి యిచ్చుచున్నారు.

## వంగపల్లి వట్టిమాటలు

వంగపల్లి నీలకంఠంఅనేఅతడు సికింద్రాబాదులో వ్యవహారాలు విచారించుకుంటూ ఉండేవారు. అంతలోవారి అదృష్టంపండింది: వరసింగరావుగారు బాల్యవివాహంబిల్లు తేవడంవంగపల్లినీలకంఠంగారు సవాకోటి నిజామాహిందువులనాయకుడుకావడం సంభవించినది. వారంతగా తెనుగు తెలిసినవారుకారు- సంస్కృతంలో ఓనమాలురావు- వారుఅప్పుడప్పుడు ఏవోతమకు తోచినముచ్చట్లు పత్రికలో వేసేవారున్నందున ప్రకటించినారు- అవన్ని వారివ్యక్తిగతమేకానిమా సనాతనసమాసభా అధికారప్రకటనలు కావనిఅన్నారు- నీలకంఠంగారు ఇటీవల కొలకంఠనిలవ తా ర ం అ ని ప్రచారంజరిగివుండెను. వా రె క ర్చై నా కా ని స నా తనప్రచారానికిగాను ౧ లక్షువరకు ద్రవ్యముచందాలమూలంగా వసూలై యుండెనని వదంతులున్నవి. వాటిలెక్కయేమి? యెంతఖర్చైంది. కమీషన్లకెంత, ప్రచారానికెంత? ఇతరఖర్చులెంత అవన్నీ ఓచర్లతోసహా రసీదులతోసహా లెక్కవ్రాసిపెట్టియుంటారు. ఆలెక్కలను సర్కారీ డిప్లమా పొందిన న్యాయస్థుడును నీతిపరుడునులయిన ఒక ఆడిటర్ చేత ఆడిట్ చేయించి లెక్కలుప్రకటించేవరకు ఏసనాతనుడుకూడా మరోకస్సైసా యియ్యకూడదు. ఈలెక్కలను పరీక్షించుటకు సవాకోట్ హిందువులలో ప్రతివానికిని హక్కుండవలెను ఈసంగతిని నీలకంఠంగారు అందరికిన్నీ స్పష్టంచేయవలెను.

# విశాఖపట్నం చాలా గొప్ప వర్తకస్థానము కాగలదు

## విశాఖపట్నం నౌకాశాల నిర్మాణమువల్ల ఆంధ్రులభవిష్యత్తునందు కలుగుమార్పులు

(భావరాజు వేంకటకృష్ణారావు గారు)

### హిందుయుగమున నౌకాశ్రయములు

శాతవాహనులకు పూర్వము కృష్ణానదీ ముఖద్వారమునందుండిన మంజేరు ప్రసిద్ధ వాణిజ్యస్థానముగానుండెను. అది నాగరాజు లాంధ్రదేశమునేలిన కాలము, మంజేరు, మాజేరుఅయినది. మాజేరు ప్రసిద్ధి కాలగర్భములో లీనమైపోయినప్పటికిని మాజేటివారను ఇంటిపేరు వైశ్యకుటుంబములందు గానవచ్చుచున్నది. శాతవాహనులకాలమున పినాకినీ ముఖద్వారము మొదలుకొని సముద్రతీరమునంటి కళింగపట్టణమువరకు యెన్నో ప్రసిద్ధనౌకాశ్రయములు వెలసియుండెను. ఇప్పుడువాటిలోకొన్ని నామమాత్రావశిష్టములయియున్నవి. కొన్ని రూపుచెడి కానరాకున్నవి. నేటివరకునామమాత్రముగనున్నవాటిలో గంజాము, కనుపట్టు, కోడూరు కంటకశైల, ఘంటశాల, కడలిపల్లి(కట్లీపల్లి) ప్రాఖారు కోరంగి మొదలయినవి పేర్కొనదగినవి. శాలివాహన సామ్రాజ్యము అంతరించిపోయినప్పటికి దానివెనుకవెలసిన ఇక్ష్వాకువంశీయుల సామ్రాజ్యము, తరువాత బృహత్పలాయనకాలంకాయనవిష్ణుకుండ యిత్యాది రాజవంశీయులప్రాపున విదేశవాణిజ్యము అభ్యుదయ పరంపరగా వర్ధిల్లుచుండినకతన తూర్పుతీరమున ఎన్నో రేవుపట్టణములు, వర్తకస్థానములు, నౌకాశ్రయములు అఖండవిభవైశ్వర్యములతో తులతూగుచుండెను అటుపిమ్మట చాళుక్యయుగమునందుకూడ ప్రసిద్ధ నౌకాశ్రయములు, వర్తకస్థానములు పెక్కులుండెను. వాటిపేరులును వాటిచరిత్రయు మాత్రము కాలగర్భమునుండి యితరతింకను రాలేదు, కాకతీయ సామ్రాజ్యకాలమున మోటుపల్లి ప్రసిద్ధనౌకాశ్రయమైయలరారెను. మోటుపల్లి వేటపాలెమునకు సమీపముగానున్నది. రుద్రమదేవి కాలమున ఆంధ్రదేశమున ప్రఖ్యాతవర్తకస్థానము మోటుపల్లియని మార్కొపోలో వ్రాసిపెట్టిన గ్రంథమువలన తెలియుచున్నది.

### కాల్ పట్టణము

ఆకాలపు ప్రసిద్ధ వర్తకస్థానములలో నొకటి కొల్పట్టణము, ఈపట్టణమునకు శ్రీనాథునిపితామహుడు కమలనాభామాత్యుడు అధికారిగానుండెను. కాల్ పట్టణము, కృష్ణాజిల్లాలోనికాలీపట్టణమని కొందరి యభిప్రాయము. కాకతీయాంధ్ర సామ్రాజ్యము విచ్ఛిన్నమైనపిదప తూర్పుతీరము రెడ్డపాలనములోనికివచ్చెను. అనాడుకూడ మోటుపల్లి ప్రఖ్యాతివాణిజ్యస్థానమై యలరారెను. ఆంధ్రదేశమునొక్కవాణిజ్యసంపదఅనాడెట్లుండెనో యెనకుకొంతవరకు శ్రీనాథుడు హరవిలాసమునఅవచి తిప్పయ్యసెట్టివంశకథయందు తెలిపినాడు. రెడ్డయనంతరము దేశముపరాధీనమయ్యెను ఆదిమొదలు ఆంధ్రదేశవర్తకభాగ్యము కొంతతగ్గను-ఒకశతాబ్దము గడచునప్పటికి తూర్పుతీరము బహమనీరాజ్యమునందు చేరిపోయెను.

### మహమ్మదీయ యుగము

కుతుబ్ షాహీ రాజవంశము ప్రాభవముగోల్పోవు కాలమాసన్నమయ్యెను. వారిరాచరికమందుపటుత్వము సన్నగిలెను, ఔరంగజేబు అన్నభీతితోనున్న ఆంగ్లేయులు మచిలీబందరువిడిచిపెట్టి దక్షిణమునకు, ఆంధ్రకర్ణాట సామ్రాజ్యమునకుబోయిరి. మాదిరాజుపట్టణముచెంత పోర్టుసెయింటుజార్జికోటను గట్టుకొని, నౌకాశ్రయమునునిర్మించుకొని మచిలీబందరునుండి నౌకావాణిజ్యమున-తయునుమాదిరాజుపట్టణములేక చెన్నపట్నమునకు మార్చివేసిరి, మాదిరాజుపట్టణమే నేటిమద్రాసునగరము. ఇంగ్లీషువర్తకులతోపాటు వారినిదుబాషులుగా నాశ్రయించుకొన్న వ్యాపారిముఖ్యకుటుంబములు వైశ్యకుటుంబములు అనేకములు కృష్ణాతీరమును మచిలీబందరును విడిచిపెట్టి దక్షిణమునకుబోయి చెన్నపట్టణము నాశ్రయించిరి. అదిమొదలుగా వర్తకలక్ష్మి ఆంధ్రభూమిని విడిచిపోయెను, వర్తకలక్ష్మితో సకలైశ్వర్యములును గూడనంధ్రదేశమును విడిచనియెను, ఈపృత్రాంతిముజరిగి యించుమించుగా రెండువందల సంవత్సరములు కడచెను.

౧౭౫౯లో నైజాం ప్రభువు నవాబుసలాబత్ జంగ్ బ్రిటిషువారికిచ్చివేసెను. నాటినుండిమచిలీబందరు బ్రిటిషువారి యధీనములోనికివచ్చెను. నిజాంఅల్లీఖాను అసఫ్ జాహికిని బ్రిటిషువారికినిజరిగినసంధిషరతులననుసరించి, మచిలీపట్టణమునిజాంరాజ్యమునకు ప్రధానరేవుపట్టణముగా నుండెను. అనాటి సంధిషరతులప్రకారము తనరేవులపై నిజాంతనబావుటాను ఎగురవేసికొనుచు, ఏవిధమైనసుంకములనీయ నవసరములేకుండగనే, బందరురేవును, ఉపయోగించుకొనుటకు నిజాంప్రభువునకు హక్కుగలదు. ఆటుకలకత్తాయిటుమద్రాసు రేవుపట్టణములనడుమ పోటీకినిలువజాలకపోయినను ఒకప్రసిద్ధవర్తక స్థానముగానైనను వర్ధిల్లుటకుఅవకాశములు కన్పట్టెను.

### విశాఖపట్నం రేవు

కలకత్తామద్రాసు నగరములనడుమ వేయిమైళ్లకంటె ఎక్కువదూరముకలదు, ఈరెండింటికినడుమగా నొకమంచి నౌకాశ్రయమును, వర్తకస్థానమును ఆవశ్యకమయ్యెను. వాణిజ్యపరిస్థితులకు రాజకీయపరిస్థితులు తోడుపడెను. మనదేశమునంటియున్న మహోదధి (బంగళా ఖాతము) కావల మలయా ద్వీపకల్పముకలదు. అచ్చటసింగపూరు యుద్ధనౌకాశ్రయంగలదు. ఆయుద్ధనౌకాశ్రయముతో సంబంధముకలిగి, అవసరము వచ్చినపుడు యుద్ధనౌకాశ్రయము రేవుస్థలమొకటి కలకత్తామద్రాసుపట్టణములనడుమ కావలసివచ్చెను. అట్టిరేవుపట్టణము ఆంధ్రదేశమునందేగాని, మరియొచ్చట ను కానరాదయ్యెను. ఏరాడకొండకు డాల్ఫిన్సునోసు అనియింగ్లీషులోపేరు. ఏరాడకొండకును విశాఖపట్టణము దారిచివరకొండకునునడుమగా ఒక ఉప్పుటేరువొచ్చుకొనివచ్చి, ఊరిపడమటిదిక్కునకు, ఒకాందూరము ప్రవహించుచుండును. ఈఉప్పుటేరునుత్రవ్వి దానిపశ్చిమదిక్కున ఒకకాలనుత్రవ్వి అచ్చటఓడలునిలుచుటకు తగినఆశ్రయములు నిర్మించినయెడల విశాఖపట్టణము మంచినౌకాశ్రయము కాగలదని ఇండియాప్రభుత్వమువారికి తోచెను.

### నౌకాశ్రయనిర్మాణము ప్రథమఘట్టము

౧౯౩౩ సంవత్సరము ముగియవచ్చుసరికి విశాఖపట్టణ నౌకాశ్రయనిర్మాణమునందు మొదటిఘట్టము పూర్తియైనది. ఆసంవత్సరము ౧౯ వడిశంబరుతారీఖున విశాఖపట్టణ నౌకాశ్రయమును ఓడల రాకపోకల వ్యాపారమునకు ఇండియా ప్రభుత్వమువారు తెరచితిమని ప్రకటించిరి. అదినము ఆంధ్రభూమికి పండుగరోజు. విశాఖపట్టణ నౌకాశ్రయమును వాణిజ్యస్థానమును పోషించుటకును దానివెనుక ౧,౨౦,౦౦౦ చతురపుమైళ్ళ వైశాల్యముగల భాగ్యవంతమైనసీమకలదు.

### ఆంధ్రులకు అదృష్టము

మరలకాలము ఆంధ్రదేశమునకు అనుకూలముగానున్నదనుటకు విశాఖపట్టణ నౌకాశ్రయము నకు మంచిదశకలుగుట ప్రబలతార్కాణము- అవర్తకముచాలాభాగము మదరాసు, కలకత్తారేవులనుండి, విశాఖపట్టణమునకు మరలగలదు. ఇప్పుడుజరుగుచున్న మహాయుద్ధానంతరము ఈఫలితముకలుగగలదు, భావిభాగ్యసూచనలు నేడుకూడ కనబడుచున్నవి. కలకత్తాలో నిర్మింపబడవలసిన ఓడలదొడ్డి(షిప్పింగ్ యార్డు) ఆంధ్రదేశ భాగ్యవశమున విశాఖపట్టణమున కట్టుటకు నిశ్చయమయ్యెను- సింధియా కంపెనీవారి సంకల్పము విశాఖపట్టణము నుద్ధరించుటకు కాకపోయినను మనభాగ్యవశమున విశాఖపట్టణము నుద్ధరించుటకే అయినది. కలకత్తా వాణిజ్యసంఘములు, బంగాళాదేశప్రజలు ఓడలదొడ్డిని కలకత్తాలోనే కట్టించుటకు ఎంతప్రయత్నముచేసినను, సింధియాస్టీము నావిగేషనుకంపెనీవారు విశాఖపట్టణమునందు కట్టుటకేనిశ్చయించిరి, దీనివలన ఆంధ్రభూమికిఎంతలాభము, ఐశ్వర్యము, భాగ్యముకలుగనున్నదో, ఆంధ్రదేశప్రజలు ఎరుగలేకున్నారు.

ఒకనాడు తెలుగుదేశమునుండి వ్యాపారముఖ్యులు, వైశ్యకుటుంబములు తండోపతండములుగా, చెన్నపట్టణమునకు వలసపోయి, అనగనగభాగ్యమునకు రెండున్నర శతాబ్దములకాలము ప్రాపయిరిలచిరి. కాని ఆతెలుగువారలకృషి ఫలితమంతయు పరాధీనమైపోయెను.

### మద్రాసు కోల్పోయినను ఫరవాలేదు

చెన్నపట్టణమున తెనుగువారికి కాణాచిలేకుండపోవుచున్నది. చెన్నపట్టణము ఆంధ్రులవశముకాగూడదని అరవలు విశ్వప్రయత్నములు చేయుచున్నారు. నేటిపరిస్థితులనుబట్టిచూచినయెడల చెన్నపట్టణము తెలుగువారి వశమునుండి జారిపోగలదనుసూచనలుకనపడుచున్నవి. చెన్నపట్టణము ఆంధ్రభూమినుండి విడిపోయినను విడిపోవునుగాక! కాని అచ్చపుటాంధ్రదేశభాగమైన విశాఖపట్టణమునకు మహైశ్వర్యమును, మహోచ్ఛదశయు ప్రాప్తింపనున్నదని ఆంధ్రులుగుర్తించుటఆదిలేస్స. విశాఖపట్టణమునందున్న నౌకాశ్రయము ఇపుడుకట్టబడుచున్న ఓడలదొడ్డిమూలమున బ్రహ్మాండమైనవర్తకస్థానముకాగలదు.

ఈరహస్యమును ఆంధ్రులుగుర్తెఱిగియున్నట్లు తోచదు. చెన్నపట్టణమునకు తరలిపోయిన వర్తకకుటుంబములు మరలవిశాఖపట్టణమును చేరుకొందురుగాక. విశాఖపట్టణమునందు, ఆంధ్రులు, మరయితరులఅపోటీలేకుండ మొలకువతో వాణిజ్యమునుసాగించుకొందురుగాక. ఈసమయమున ఆంధ్రులు ఏమాత్రముయుపేక్షనుమరిగి ప్రమత్తులయి యూరకున్నచో, ఆంధ్రదేశపువర్తకపు భాగ్యమంతయు, గడుసునైన తెంగాలీలు, సాహసికులయిన బొంబాయి గుజరాతీలు, మార్వాడీలు, వర్తకరహస్యములు తెలిసిన యితర ప్రాంతములవారును విశాఖపట్టణమునందు కాణాచిపాదుకొల్పుకొనుచు ఆనాడంధ్రులకు కూలివానిజీవితముఅబ్బును. తనదేశభాగమును ఒరులకునప్పగించి ఆంధ్రుడుచేతులునలంపుకొనుచు కండ్లుపెటకరించిచూచుచు ఊరకుండవలసివచ్చును.

విశాఖపట్టణమునందు నౌకాశ్రయము నంటి పదహారు మైళ్ళభూమిని నౌకాశ్రయాధికారులు ఆక్రమించుకొనియున్నారు. అచ్చటముందుముందు వర్తకవ్యాపారముకొరకు ఒక మహానగరముకట్టబడగలదు. పరిమోద్ధతపువాత విశాఖపట్టణము, ఇప్పటివిశాఖపట్టణమువలెనుండదు. గోపాలపురము రైల్వేస్టేషను మొదలుకొని అయిదుమైళ్ళపర్యంతము ఒక మహానగరమువ్యాపించి కలకలలాడుచు కన్నులపండువై గోచరించును.

(ఆంధ్రపత్రిక)

## గోలకొండ గ్రంథాలయము

### నా కొడుకు

కర్త ధనికొండ హనుమంతరావుగారు
ప్రకాశకులు:- ఆణా గ్రంథమాలవారు
హైద్రాబాదు.

వెల ౧౹అణా కల్దారు

ఇది ఒక చిన్నకథ, సుబ్బారావు అనేవాడు తన మిత్రుడైన గోపాలం అనేవానివద్దకు తానుఉంచుకొన్న ఒక స్త్రీని పంపిసాడు.-గోపాలం ఆమెతో ఆనందించి౧౦౦ రూపాలిచ్చి తనదేశంపోయివాడు ఆరేండ్లతర్వాత ఒ-ఏండ్లపిల్లవాడొకడు బాపట్లలో గోపాలంచేతులు పట్టుకొన్నాడు "మా అమ్మపిలుస్తుందిరా" అన్నాడు- ఇంట్లోకిపోగా అచ్చటతాను పూర్వంపొందిన స్త్రీ ఉండింది- ఆమె సుబ్బారావుభార్యయేయనిన్ని ఆపిల్లవాడు గోపాలానికేపుట్టినాడని ఆమెవల్ల అతనికి తెలిసింది తనవార్థం తనభార్యతో వ్యభిచారం చేయించినాడుసుబ్బారావు-ఇది ఇందలి కథ.

---

### సుఖీసంసార్ (హిందీ)

వెల ౧ అణా పుటలు ౬౪ ప్రకాశకులు ధర్మజీవాసమితి డి. ఏ. వీ. ఫార్మసీ కోఠీ, బస్ స్టాండ్ హైద్రాబాదు దక్కన్.

ఇందు హిందీభాషలో మంచి శైలియు అందరికీ పనికివచ్చు ధార్మికనీతి బోధనుగురించి వ్రాసియున్నారు. అసత్యము చౌర్యము, అవినీతి, అన్యాయము ఇట్టివాటివలన సమాలవష్టము లున్నా తాత్కాలిక సుఖమున్నా కలుగుననియు, సత్యము శౌచము క్షమ దమ విద్యాది సద్గుణములవలన శాశ్వత సౌఖ్యము కలుగుననియు వానీయున్నారు. మంచి నీతిగ్రంథము.

---

### సామ్యవాదం (సోషలిజం)

పుటలు ౩౬. వెల ౧ అణా కల్దారు. కర్త గొబ్బూరు రామచంద్రరావుగారు.

సామ్యవాదం అనేమాట యిప్పుడు చాలాప్రచారంలోకివచ్చింది. సోషలిజం అనేదానికిది తెనుగుసృష్టి, సోషలిస్టుఅంటే భయంకరమగుమనిషి అనేభావన కొన్నితావులఏర్పడింది. ఈసామ్య సిద్ధాంతంఏమిటో టూకీగా తెలుసుకోవాలంటే యీగ్రంథం చదువండి. ఇందుఆశ్చర్యంఏమంటే గ్రంథకర్త పండొలిచి చేతులోపెట్టినట్లుగా సులభంగాఅర్థమయ్యేరీతిగా వ్రాసినాడు. శైలివ్యావహారికంబాగాఉంది. దీన్ని బట్టిచూస్తే ఈగ్రంథకర్త రానురాను చాలామంచి గొప్పగ్రంథకర్తకాగలడనే విశ్వాసం ఆనందంకలుగుతూఉంది.

---







## యుద్ధం ఆవగింజలో అరభాగంకాలేదు

స్మట్సుగారి ప్రకటన

జూన్ ౧౭-తేదీన ప్రిటోరియాలో, దక్షిణాఫ్రికాలోని సైనికశాఖయందలి స్త్రీల ఉత్సవపు దర్బారులో ఫీల్డుమార్షలుస్మట్సుగా రుపన్యసించుచు యిట్లన్నారు.

"యుద్ధమింకా ముగింపుకురాలేదు. ఇప్పుడే యుద్ధం ప్రారంభమయినదని చెప్పాలి. ఇంకా ముందుముందు చాలాకష్టాల ననుభవించవలసి ఉంటుంది-మానవజాతి భగవంతునిసృష్టిలో స్వేచ్ఛననుభవించుటకే నిర్మింపబడిందిగాని బానిసతనానికిగాదు, ఈయుద్ధం మానవ స్వాతంత్ర్యంకొరకేసాగుతోంది. మనమట్టి స్వాతంత్ర్యానికి అర్హులమని ఋజువుచేయవలసి ఉన్నది.

ఇక్కడ సైనికశాఖలోని స్త్రీదళం పురుషులతోపాటు కష్టసుఖాలలోపాల్గొని చాలాసేవచేసినది. ఏపరిస్థితిలోనయినా ఆఫ్రికా స్త్రీలు అనాదినుండి పురుషులతోసమానంగా పనిచేసేవారు, ఆత్రినిలబెట్టి నేటి ఆఫ్రికా స్త్రీసంఘంకూడా యుద్ధంలోపాల్గొని పురుషులకు చాలాసహాయంచేస్తున్నందుకు చాలాసంతోషంఅని తనయుపన్యాసమును ముగించెను,

---

## క్రొత్తరూపాయినోట్లు

ఇండియా ప్రభుత్వమువారిట్లు ప్రకటించినారు,

ఇండియాప్రభుత్వంవారి క్రొత్తరూపాయినోట్లు, ౬. వజార్జిరాజా గారిపటముతోటి నాసికలో స్యూరిటీప్రెస్సులో ముద్రింపబడినవి. రిజర్వుబ్యాంకుద్వారా జారీచేయబడును, అవియిప్పటివాటికన్న పెద్దవిగఉండును. ఎడమవైపు రాజా గారిబొమ్మ నీటిమార్కు-తెల్లముద్రవేసి పైకనబ్బునట్లుగ అగుపడుచుండును. దానిచుట్టు కిటికీవలెబార్డరుండును. కుడివైపుమీదను రూపాయినాణెపు చిత్రముండును మధ్యగమీదను "ఇండియాప్రభుత్వం" ఒకరూపాయిఅని ఇంగ్లీషులోఅచ్చువేసి ౧ అంకెమున్న అశపచ్చరంగులోను గోధుమవర్ణంలోను ముద్రించబడియుండును.

మధ్యను ఇండియాప్రభుత్వముఅనుమాట క్రిందనోటువిలువ ౭ ప్రధానదేశభాషలలో వ్రాయబడియుండును.

---

### దేశబంధుగారి మృతవార్షికదినము

కలకత్తాలో జూను ౧౬-తేది సాయంకాలం యూనివర్సిటీ యిన్స్టిట్యూటు హాలులో సీ. ఆర్. దేశబంధు చిత్తరంజనదాసు గారి స్మారకోత్సవం జరిగింది. సభకు డా. జె.ఎం. దాసు గుప్తగారధ్యక్షత వహించినారు.

---

### ఆదిలాబాదులో పురాభివృద్ధి

ఆదిలాబాదును అధికారుల నివాసయోగ్యంగాను, కచ్చేరీల అనుకూల్యతకుగాను అవసరమైన పనులకు ౧౦ లక్షలుఖర్చుచేసి మూడేండ్లలోపల నిర్మాణాలను పూర్తిచేయుచున్నారు. అధికారులకు ఇండ్లు, కచ్చేరీలకుబంగ్లాలుకట్టుదురు. పట్టణాలంతారహదారికొకటి ఈపనికై అచ్చటఏర్పాటుచేయుచున్నారు,

---

సంవత్సరము చందా ౬-౦-౦ రూపాయిలు
ఆరుమాసాలకు ౩ రూపాయిలు
బ్రిటిషిండియాలో సం॥చందా ౫-౮-౦ రూపాయిలు.
పాతపత్రికలకు వెల ప్రత్యేకము.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

The only Popular Paper That reaches The masses In the Dominions
Best Medium for Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

Volume 16 | Hyderabad-Dn | Thursday 26th June 1941 | Number 16

## రష్యాపై-జర్మనీయుద్ధము ప్రారంభించుట

### రష్యాపై జర్మనీఆరోపణలు

హిట్లరుయొక్క మహోపన్యాసము

సుమారు మూడుమాసములనుండి ఇంగ్లండు ప్రధాని చర్చిలుగారు పక్షి పలికినట్లుగా హిట్లరు రష్యాపై కన్నువేసినాడనిన్నీ యింతలో రష్యాపై దండెత్తుననియు పార్లమెంటులో చెప్పుచునేయుండెను- కాని అతనియుద్దేశమంతయు నేవో కల్పనలుచేసి రష్యాకునుజర్మనీకిని తగవులాట కల్పించుటకై చేయుచున్నాడని అనుకుంటూవచ్చినారు-తుదకుచర్చిలుగారి జోస్యమేనిజమయినది-౧౦, ౧౨ దినాలనుండియు ఇప్పుడో అప్పుడో యీయుద్ధముజరుగునని వదంతులు అపారముగా బయలుదేరియుండెను- తుదకు అవన్నియు నిజమయినవి; జర్మనీకి ఫిన్లాండుసైన్యమున్ను రొమేనియాసైన్యమున్ను సహాయపడుచున్నవి

౨౨ జూను ఆదివారం తెల్లవారి మూడున్నర గంటలకు హిట్లరు రేడియోపై. జర్మనుసైన్యము రష్యాతో యుద్ధముచేయుచున్నదని ప్రకటించెను. ఆసందర్భములో హిట్లరు రేడియోపై యీవిధముగ నుపన్యసించెను.

ఈసమయములో ప్రపంచచరిత్రలో నేటివరకు కనివిని యుండనట్టి మహాప్రచండమయినయుద్ధము ప్రారంభమయియున్నది జర్మనుసైన్యాలను ఫిన్లాండుసేనలు సహాయపడుచు ప్రష్యాతూర్పుభాగమునుండియు కార్పేతియన్ పర్వతముల దిక్కు దండెత్తిపోవుచున్నవి. వార్సేను జయించి న ట్టి జర్మను సే న అదిక్కునడుచుచున్నది. దక్షిణమున రొమేనియా సైన్యము మాకుతోడ్పడుచున్నది. రష్యావారి బోల్షివిజం జర్మనీవారి జాతీయసోషలిజమును నాశనముచేయుటకై కనిపెట్టుకొనియున్నది, జర్మనీ ఒకదిక్కు ఆత్మరక్షణకై పోరాడుచుండగా, రష్యా యింకొకదిక్కు యీదురుద్దేశముతో కనిపెట్టుకొనియున్నది. అట్టిసందర్భలో జర్మనీఊరకుండజాలదు- అందుచేతజర్మనీ తనసర్వశక్తులను వినియోగించి యీయుపద్రవాన్ని తొలగించవలసివచ్చినది. ఈయుద్ధములో జర్మనుప్రజలు తమదేశమును రక్షించుకొనుటయేగాక ప్రాణాంతకమయిన బోల్షివిజము, ప్రపంచమునుముంచివేయకుండా యూరోపుఖండములో నిజమయిన సాంఘికాభివృద్ధి నికలిగించుటకై పోరాడవలసియున్నది.

మరొకమారు జర్మనీదేశము తనయొక్కయు తనప్రభుత్వముయొక్కయు, తనజనులయొక్కయు భాగ్యోదయమును తనసేనకుఒప్పగించవలసి వచ్చినది- పరమాత్మ మాకీయుద్ధమందు సహాయంచేయుగాక! రష్యావారు బాల్టికుతీరమందలి చిన్నచిన్న రాజ్యాలనన్నింటిని మ్రింగివేయుట కేవలము జర్మనీకొరకేచేసినట్టికార్యము- రష్యావారున్ను ఇంగ్లీషువారున్ను ఒకేయుద్దేశముతో జర్మనీకివ్యతిరేకముగా వర్తించుచువచ్చినారు. రష్యావారు యుగోస్లావియాలో జోక్యముకల్పించుకొనియుండిరి. ఇదియంతయు వారు యుగోస్లేవియావారిపై అవ్యాజకరుణనువహించి చేసినట్టిదిగాదు. యుగోస్లేవియాలోని సర్బులను రెచ్చగొట్టినది. ఇట్లు వారు చేసినప్పటికిని మేము మౌనము వహించియుంటిమి.

౧౯౩౯లో రిబ్బనుట్రాపుగారు మాస్కోకు వెళ్ళి రష్యాతో సమాధానపడుటకు ప్రయత్నించిరి-అప్పటిలో రష్యాజర్మనీదేశాలు ఒకరిపైనొకరు దండెత్తి ఆక్రమణలు చేయగూడదని సమాధాన పత్రమును వ్రాసుకున్నవి. కాని రష్యావారు లిథుయేనియాను ఆక్రమించుకొన్నతరువాత అక్కడినుండి వేలకొలది జర్మనులు లేచిపోవలసివచ్చెను. అక్కడికిన్నీ మేము మౌనమువహించితిమి. పోలెండులో జర్మనులుయుద్ధంచేసి దానినిజయించిరి. అప్పటిలో మేము ఇంగ్లీషువారితో సంధిచేసుకొందుమని ప్రకటించితిమి. కానియింగ్లీషువారికి రష్యా సహాయపడునను ఆశఉన్నందున వారు మాకోరికనునిరాకరించిరి. తరువాత రష్యావారు బాల్టికు రాజ్యాలనన్నింటినిన్నీ ఫిన్లాండునున్ను తమవశములోనికిలాగుకొను ప్రయత్నముచేసిరి. ౧౯౪౦లో రష్యావారు బాల్టికురాజ్యాలలో ౨౨అక్షౌహిణులను సిద్ధముగపెట్టియుండిరి. ఇదంతయుజర్మనీని బెదిరించుటకు చేసిన యెత్తు-

రష్యావిదేశాంగ మంత్రిగానున్న మొలటోవుగారు బర్లినునగరానికివచ్చినపుడు నాపై నాలుగు ప్రశ్నలీవిధముగా వేసెను, రష్యా- రొమేనియాలోనిబెసరేబియాపై, బుకవీనాపై దండెత్తిపోయిన జర్మనీఊరకుండునా? (౨)రష్యావైఫిన్లాండు మరొకమారుతిరుగబడిన జర్మనీ ఫిన్లాండుకు సహాయంచేయకుండనుండునా? (3) బల్గేరియా సహాయార్థము రష్యాసేనలను పంపినయెడల దానిని జర్మనీఅంగీకరించునా? (౪)రష్యాకు డార్డెనల్సు జలసంధిద్వారా పోవుటకు బాస్పరసువద్ద సైన్యములను నావికాబలమును రష్యావారు పెట్టుకొనుటకు జర్మనీవారంగీకరించెదరా?'' (ఈ ప్రశ్నలకు హిట్లరు ఏమిజవాబిచ్చినాడో అవిప్రకటింపబడలేదు-హిట్లరుమరల తనధోరణినిసాగించుచు యిట్లన్నారు.)

ఇంతవరకు రష్యాదేశపుహద్దులదిక్కు జర్మనుసేనగాని జర్మనుటాంకులుగాని లేవియులేకుండెను-కానిరష్యావారు జర్మనుసరిహద్దులవద్ద ౧౫౦ డివిజన్లను సిద్ధముగాపెట్టియుండిరి. ఈకారణాలచేత రష్యాతనఒడంబడికకు భంగముకలిగించినది.

## జర్మనీ—రష్యాకుపంపిన యుద్ధపత్రము

౨౨ జూనునాడు జర్మనుమంత్రియగు రిబ్బనుట్రాపుగారు రష్యా రాయబారికి బర్లిను నగరములో యీక్రిందివివరములుగల ప్రకటనను అందజేసిరి.

౧౯౩౯ ఎండకాలములో జర్మనీ రష్యాలకున్న సంబంధాలనుదిద్దుకొనదలచి జర్మనీప్రభుత్వం రష్యావారినికదలవేసినది. స్వతంత్రజాతులన్నికలిసినమాదలి ఒకటియేర్పడవలెనని ఒకవైపు రష్యా అంటూ వేరొకవైపు స్వతంత్రజాతినిర్మూలనం చేసి ప్రభుత్వమును సాగింపదలచిన కమ్యూనిష్టు యింటర్నేషనలులోని ఒకపక్షంవారు రాజ్యం సాగించుచున్నారు. ఇట్టివారితో సంధిపొసగుట చాలాదుర్ఘటంఅని జర్మనీకి తెలియును. సోవియటు రష్యాకు జర్మనీకిగలవిభేదాలను, నేషనలు సోషలిజానికీ బోల్షివిజానికిగలిగిన అనుమానవైరుధ్యాలను త్రోసిపుచ్చి ఎట్లయినా రాజీకుదుర్చుకోవాలని జర్మనీ ప్రభుత్వంవారు ప్రయత్నంచేసినారు. జర్మను ప్రభుత్వంవారు యిట్టిఒడంబడిక కుదుర్చుకోటానికిప్రయత్నించుటలోవారిఅభిప్రాయమేమంటే, ఈఒడంబడిక కుదిరినట్లయితే ఉభయపక్షాలవా యుద్ధములేకుండా పోవుననియు, ఇట్లు, ఉభయదేశాలుస్నేహంగాఉన్నట్లతే,యూరపులో కమ్యూనిష్టు సిద్ధాంతంగాని, మరేవర్గాలుగాని వ్యాపింపజాలవనియు, జర్మనుప్రభుత్వమువారీప్రయత్నంతలపెట్టినారు దీ ని ఫ లి తం గా ౨౩-౮-౧౯౩౯ తేదిని ఒకనిరాక్రమణపుటొడంబడికకుదిరినది. ౨౮-౯-౧౯౩౯ నాడు సరిహద్దుమైత్రి ఒడంబడికను యీరెండువర్గములవారున్ను కుదుర్చుకున్నారు. ఈఒడంబడికలలోని ముఖ్యవిషయమేమంటే "౧. ఒకరిపైనొకరు ప్రయోగాలు చేసుకోకుండాఉండి, శాంతిగా స్నేహంగా ఉండేటట్లు ఒకరికొకరు వాగ్దానాలుచేసుకొనుట, ౨. ఉభయులకు ప్రాబల్యంగలస్థానాలను నిర్ణయించుకొనుట''. దీనినిబట్టి జర్మను ప్రభుత్వము, లాట్వియా, ఎస్టోనియా, ఫిన్లాండు, లిథుయేనియా, బెస్సరేబియాలపై తనప్రాజాపత్యము నువదలుకొన్నది. మరియు, నార్వే, బగ్, సాన్ నదునివరకు పూర్వపు పోలిషురాజ్యభాగమును రష్యావారుకోరినందున జర్మనీ వా ని ని వా రి కి ఎ ద లి వే సి న ది. మరియు, జర్మనీయీఒడంబడిక కుదుర్చుకొన్నది మొదలు, రష్యాపైతనవైఖరిని మార్చుకొని సోవియటు యూనియనుతో మిత్రభావముతో మెలగుచున్నది. రష్యాప్రభుత్వంతో చేసుకొనినఒడంబడికపై జర్మనుప్రభుత్వము తు-చ- తప్పకుండఆచరించినది. సోవియటుయూనియను పుట్టిపెరిగిన పిదపయెన్నడూ యెరుగని అఖండవిజయసౌభాగ్యాన్ని, జర్మనులరక్తధారల దానంచేసి సంపాదించి పోలెండును రష్యాకువశంచేసినది. రష్యాపట్లజర్మనీమైత్రి ఉండకపోయినా, జర్మను సైన్యాలు కష్టించకపోయినా యీఅదృష్టం రష్యాకు లభ్యమగునదికాదు.

ఇకను, చేసుకొనినఒడంబడికకు విరుద్ధంగా జర్మనీకివ్యతిరేకంగా సోవియటు యూనియను అవలంబించిన చర్యలనుగూర్చిన పూర్తివివరాలు త్వరలోనే జర్మనుప్రభుత్వము ప్రకటించును. దీనినిబట్టిజర్మనీతో సోవియటు ప్రభుత్వమంగీకరించిన మైత్రిమోసంతోకూడినదని, స్పష్టము. జర్మనుస్నేహంకల్ల తానులాభాలు పొందుచున్నా చివరకు జర్మనీపట్లరష్యా కృతఘ్నమయిపోయినది. ఈఒడంబడికకై జర్మనీపలుకులకు రష్యాఊపినతలఊపులు కేవలం నక్కజిత్తులవంటివని అనుకోకతప్పదు. ఈవిషయం, జర్మనులు బెల్గ్రేడును ఆక్రమించినతర్వాత అక్కడిసోవియటు రాయబారికార్యాలయంలోదొరికిన ఒకరష్యాను పత్రమునుబట్టి బయటపడగలదు. అపత్రములో ఇట్లున్నది.

"ఏలుచిక్కే వరకు రష్యాఏమిచేయదు. అప్పటికిఆ రాజ్యాలు యింకాబలహీనములగును. అప్పుడురష్యా జర్మనీపైహఠాత్తుగాపడి విరుచుకు తినవచ్చును''

జర్మనీలోను యూరపులోని యితరభాగాలలోనురష్యావారు జరిపినవిరుద్ధప్రచారంవల్ల, జర్మనీపట్లసోవియటు ధోరణియెట్లున్నదో తెలియగలదు.

ఇంతేకాకుండా రష్యాబ్రిటనుతోకలిసి యెక్కువగా పనిచేయనారంభించినది. జర్మనీపై రష్యావైరభావము ౧౯౪౧ జనవరిలో రాజ్యతంత్రవ్యవహారములలో ముందుగాబయటపడినది. గ్రీసులో బ్రిటిషుసేనలు దిగకుండుటకు బల్గేరియాకవసరమగు సైనికపద్ధతులసమంజసములని ఆక్షేపించి బల్గేరియాతాలూకు రెండుజలసంధులను తనరక్షకస్థానములుగా అకట్టుకొనినది. జర్మనులుతాము చేసిన చర్యలయొక్క ఆశయములను రష్యాకు తెలిపినను రష్యావారు, జర్మనులకువిరుద్ధంగా బల్గేరియావిషయంలో ప్రవర్తించినారు. ఈసంగతి యుగోస్లావియాలో జర్మనీకి వ్యతిరేకంగా జరిగినఆందోళనలో భయంకర రూపమును దాల్చినట్లు పత్రములవల్లస్పష్టముగా తెలుచున్నది.



## క్రాఫ్టుగారు

మిస్టర్ ఆర్.యం క్రాఫ్టు ఐ. సీ. ఎస్. హైదరాబాదు భూవ్యాదాయశాఖా కార్యదర్శిగారిని బ్రిటిషిండియాప్రభుత్వమువారు మధ్యపరగణాలయొక్కయు బరారుయొక్కయు కమిషనరుగానియమించినారని ఓరియంటు ప్రెస్సువారు ప్రకటించుచున్నారు.

## న॥ హాషింయార్జంగు

పూర్వం హైకోర్టుజడ్జీగాను ముషీర్ ఖానునుగానుఉండి 3 ఏండ్లక్రిందట ఉపకారవేతనం పొందిన నవాబ్ హాషింయార్జంగుబహద్దరుగారు హృద్రోగముచేనుండి ౧౮ అమర్దాదునాడు చనిపోయిరి, వారుచాలాఉత్తములు. ధర్మభీతిగలవారు. మంచిమతభక్తికలవారు. కాని మతపక్షపాతమెరుగనివారు.

## మహబూబుగంజి నిర్మాణము

హైదరాబాదులో ఉస్మానుగంజి ముఖ్తారుగంజి, మహారాజుగంజి, మహబూబుగంజి అను నాలుగు పెద్దవ్యాపారస్థలాలున్నవి. ఇవి మురికిస్థలాలు. రోగాలుఇక్కడ మొదలు జన్మమెత్తును-కావున వీటినిబాగుచేయుటకై ప్రభుత్వమువారు ఖర్చుచేసి ఎలుకలులేకుండునట్లుగా కొఠాలు నిర్మింపజేయుదురు. గంజియంతలో సిమెంటుతో బాటలు వేయబడును. ఈపనిప్రారంభమైనది. ముందుసంవత్సరం వరకు పూర్తికాగలదు.

## సికింద్రాబాదులో డాకా

౨౩జూనునాడురాత్రి ౧౧గంటలకు సికిందరాబాదులో ఒకడాకాజరిగినది. రాజేశ్వరటాకీసువద్దనుండు ఒకహోటలుమీద ఒకదొంగలగుంపు లాఠీలయుక్తముగాపడి ౧౫౦రూపాయిలనగదును లాగుకొనిరి, ఈసంగతిపోలీసువారికి తెలియగానే వారు మెరుపువలె అక్కడికివచ్చిరి. ఇంకొడాకాలుఅచ్చట నేయుండిరి. వారికి పారిపోవుటకుఅవకాశమీయకుండా పోలీసువారు వారినిముట్టడించి పట్టుకొనిరి. ఈగుంపులో ముగ్గురుజెయిలుకుపోయివచ్చిన దొంగలున్నారట.

## మంత్రిగారి దౌరా

గౌ॥ అబ్దులజీజుమంత్రిగారు ఉస్మానాబాదులో దౌరాచేయనున్నారు, ఉస్మానాబాదులోని న్యాయస్థానమునుపరీక్షించినారు, ఇంతకుముందు తుల్జాపూరుకువెళ్లియుండిరి. అక్కడిదేవస్థానమును తనిఖీచేసి తృప్తికరముగానున్నదని అభిప్రాయపడిరి.



Printed and Published by, G. Ramakrishna Reddyat theGolkonda Power Press, Hyderabad Dn, Editor- S. Prathapa Reddy B, A,B,L,